


# మూడవ మెట్టు

[ తృతీయ ప్రణాళికలో ముఖ్య కార్యక్రమాలు ]



పిడతల రంగారెడ్డి
ప్రణాళికా సమాచార శాఖల మంత్రి, ఆంధ్రప్రదేశ్

ప్రచురణ:
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార పౌరసంబంధాలశాఖ
హైదరాబాదు.

# మూడవ మెట్టు . . .

రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో ఆంధ్రప్రదేశ్ అన్ని రంగాలలోను ముందడుగు వేసింది. ప్రణాళికకు కేటాయించిన మొత్తం కంటె అదనంగా గూడా ఖర్చయింది. ఆ అయిదేండ్లూ రాష్ట్రం ఉదయించిన తర్వాత మొదటి అయిదేండ్లు ప్రజలంతా అత్యంతోత్సాహంతో అభివృద్ధి కార్యక్రమాల్లో సహకరించి అనేక విజయాలు సాధించారు. పంచాయతీ రాజ్యం మొదలైన కొన్ని ముఖ్య రంగాల్లో మన రాష్ట్రం తక్కిన వాటి కన్నిటికీ మార్గదర్శి కూడా అయింది.

ఈ విజయాలను, రాష్ట్ర ప్రజల అవసరాలను, అవకాశాలను మనసులో వుంచుకొని మూడవ ప్రణాళికలో రు. 305 కోట్లు ఖర్చు చేయవలెననే నిర్ణయం జరిగింది. ఈ కేటాయింపు చాలినంతగా లేదనే అభిప్రాయం వున్నప్పటికీ, అన్ని పరిస్థితులూ పరిశీలించిన తర్వాత నిర్ణయించిన మొత్తం గనక, అభివృద్ధి కార్యక్రమాలన్నీ యీ హద్దుకు లోబడి ఉండేటట్లు ప్రణాళిక రూపొందింది. ఈ కార్యక్రమాల లోని ముఖ్యాంశాలు ఈ వ్యాసాల్లో వివరింపబడ్డవి ప్రతి అంశం మీదా అఖిల భారత స్థాయిలో నిర్ణయింప బడిన లక్ష్యాలను గూర్చి కూడా క్లుప్తంగా వివరణ వున్నది. ప్రణాళిక పూర్తి పాఠం చదివి అవగాహన చేసుకునే అవకాశం లేనివారి కందరికీ యీ వ్యాసాలు ఉపకరిస్తవి.

# విషయసూచిక





మట్టంపల్లి (నల్గొండ జిల్లా) పంచాయతీ సభ్యులు

# సమాజాభివృద్ధి

దేశవ్యాప్తంగా యిప్పుడు సమాజాభివృద్ధి ఉద్యమం 3,70,000 గ్రామాలలో సాగిపోతున్నది. ఈ ఉద్యమం నడపడంలో ముఖ్య కేంద్రాలుగా ఉన్న బ్లాకు లనేవి యిప్పుడు దేశంలో 3,100 ఉన్నవి. వీటిలో 880 బ్లాకులు ఐదేండ్ల కంటె యెక్కువగా పనిజేస్తున్నవి. కాబట్టి ప్రథమస్థాయి దాటి యీ కార్యక్రమంలో ద్వితీయ స్థాయి నందుకున్నవి. ఇంకా రెండేండ్లలో, అంటే 1963 అక్టోబరు నెల వరకల్లా దేశంలోని గ్రామీణ ప్రాంతాలన్నిటికీ యీ ఉద్యమం వ్యాపిస్తుంది. జరిగిపోయిన రెండు పంచవర్ష ప్రణాళికల కాలంలో సమాజాభివృద్ధి కోసం 240 కోట్ల రూపాయిలు ఖర్చయినవి. మూడో ప్రణాళికలో దీనికి కేటాయింపు రూ. 294 కోట్లు. ఇది గాక పంచాయతీల కోసం యింకా రూ. 28 కోట్లు ఖర్చు చేయదలచుకున్నారు.

గడచిన రెండవ ప్రణాళికా కాలంలో మూడు ముఖ్యమైన మార్పులు జరిగినవి. మొదటిది యీ ఉద్యమం జరిగే పద్ధతిలో. మొదట్లో ప్రతి బ్లాకూ జాతీయ

విస్తరణ కేంద్రంగా బయలుదేరింది. దానికి కేటాయింపు నాలుగున్నర లక్షల రూపాయలు. ఒకటి రెండేండ్లు గడచిన తరువాత యీ విస్తరణ కేంద్రాల్లో కొన్నింటిని సమాజవికాస కేంద్రాలుగా మార్చి ఒక్కొక్క దానికి రూ. 15 లక్షలు కేటాయించేవారు. 1957 లో జరిగిన పరిశీలన ఫలితంగా యీ పద్ధతి మార్చబడింది. అంతా ఒకటే సమాజాభివృద్ధి పద్ధతి మీద రెండు స్థాయిల్లో యేర్పరచి మొదటి అయిదేండ్లకు 12 లక్షల రూపాయలు, రెండో అయిదేండ్లకు 5 లక్షలు రూపాయలు కేటాయించారు.

రెండో పెద్ద మార్పు పంచాయతీ రాజ్యం. గ్రామ పునరుజ్జీవనమే ప్రధానోద్దేశంగాగల సమాజాభివృద్ధి కార్యక్రమం నిజంగా ఫలవంతం కావాలంటే గ్రామీణ ప్రజలు హృదయపూర్వక సహకారం యియ్యటమే కాకుండా బాధ్యత గూడా చాలా వరకు తమ మీదే వేసుకోవలసి వుంటుంది. అందువల్ల గ్రామాల్లో పంచాయతీలతో పాటు బ్లాకులలోనూ, జిల్లాలలోనూ క్రొత్త ప్రజా సంస్థల నేర్పరచి వాటికి పరిపాలనా బాధ్యత యియ్యవలెనని చాలాకాలం నుంచి అనుకొంటున్న సంగతే. బలవంతరాయ్ మెహతా సంఘంవారు యీ విషయమై ప్రజాస్వామ్య వికేంద్రీకరణమనే శీర్షికతో ఒక పద్ధతి సూచించారు. జాతీయాభివృద్ధి సంఘంవారీ సూచనను 1958 జనవరిలో పరిశీలించి ప్రతి రాష్ట్రం తన పరిస్థితుల కనుగుణంగా యీ విషయమై చర్య తీసుకోవచ్చునని నిర్ణయించారు. క్రిందటి మూడేండ్లలో యిలా పంచాయతీ రాజ్యస్థాపనకై యేడు రాష్ట్రాలలో శాసనాలేర్పడ్డవి. దీంట్లో ఆంధ్రప్రదేశ్ ముందంజవేసింది. మధ్యప్రదేశ్‌లో, ఉత్తరప్రదేశ్‌లో గూడా శాసన సభల నిర్ణయం పూర్తయింది. బీహారులో శాసనం పరిశీలనలో ఉంది. మహారాష్ట్ర, గుజరాతులలో కమిటీ నివేదికలు తయారైనవి. ఈ విధంగా పంచాయతీ రాజ్య విస్తరణ దేశంలో అన్ని గ్రామీణ ప్రాంతాలకు త్వరలోనే వస్తుంది.

మూడవ విశేషం, జిల్లా పథకాలతో పాటు బ్లాకులకు కూడా ప్రత్యేక పథకాలు తయారుచేసి వాటిని రాష్ట్ర పథకంతో సమన్వయించటం. ఒక బ్లాకు ప్రాంతంలో జరుగవలసిన సాంఘిక, ఆర్థిక కార్యక్రమం బ్లాకు పథకంలో యిమిడివుండాలి. బ్లాకుస్థాయిలోను గ్రామ స్థాయిలోను నిర్ణయింపబడే పనులు, బ్లాకులో నడిచే కార్యక్రమాన్ని గూర్చి వివిధశాఖలవారు వేసుకున్న పథకాల సమన్వయం యీ బ్లాకు పథకం క్రిందికి వస్తుంది. ఈ పథకాలు తయారు చేయటంలోను, వాటి ఆచరణలోను బ్లాకులోని విస్తరణాధికారులు ప్రజానాయకులు సహకరించి పనిచేయవలసి

వుంటుంది. కొత్తగా యేర్పడ్డ పంచాయతీ సమితుల ముఖ్యకర్తవ్యం యీ బ్లాకు పథకాలను సక్రమంగా అమలులో పెట్టటమే. ఇందుకై విస్తరణశాఖాధికారులు తమలో తాము కలిసి మెలసి పనిచేస్తూ అధికార సంస్థలకు కావలసిన సలహాలు, సహాయం అందిజేయాలి. ప్రజానాయకులు కూడా తమ వంతుగా చేయవలసిన పనులు చాలా వున్నవి. తయారైన పథకాలను గూర్చి ప్రజలకు నచ్చజెప్పి వారి సహకారం పూర్తిగా లభించేటట్టు చేయటం, గ్రామీణ పంచాయతీలకు సహకార సంఘాలకు కావలసిన సహాయం చేయటం, గ్రామీణ కార్యకర్తలను తర్ఫీదు చేయటంలో తోడ్పడటం, తమతమ గ్రామాలలోవున్న కార్మిక బలాన్నంతా చేకూర్చటం, ప్రజలలో వెనుకబడి వున్నవారికి తగు సహాయం చేయటం వారి వంతు.

సమాజాభివృద్ధి కార్యక్రమంలో అత్యంత ముఖ్యమైనది వ్యవసాయం. పశుపోషణ, సహకారం, గ్రామీణ పరిశ్రమల అభివృద్ధి. మూడవ ప్రణాళికలో వ్యవసాయ, సహకార రంగాలలో కావలసిన ప్రగతికి ప్రథమ స్థానం ఇవ్వబడ్డది. వ్యవసాయ రంగంలో ఉత్పత్తి నూటికి 30 వంతులు పెంచవలసివుంది. దీనికై చిన్న నీటి వనరులు, ఎరువుల పంపకం, భూ సంరక్షణ మొదలైన కార్యక్రమం బ్లాకులలో విస్తారంగా కొనసాగించవలసివుంది. అలాగే సహకార రంగంలో, ఇప్పటి కంటె మూడు రెట్లుగా కర్షకులకు పరపతి సౌకర్యాలు పెంచవలసి వున్నది. ఈ పరపతి భూమినుండి ఉత్పత్తికే గాక, ఆ ఉత్పన్నమైన పదార్థాలను సరసంగా విక్రయించటానికి గూడా తోడ్పడవలసివుంది. గ్రామాలలోని ప్రతి కుటుంబాన్ని యీ పరపతి సంఘాలలోనికి తీసుకు రావలసిన అగత్యం వుంది. ఈ ప్రయత్నంలో సంపూర్ణ విజయం చేకూరాలంటే ప్రజానాయకులూ, విస్తరణాధికారులూ అన్యోన్య సహకారంతో పాటుపడాలి.

ఆంధ్రప్రదేశ్‌లో మొత్తం 445 బ్లాకులు యేర్పాటు చేయవలెనని నిర్ణయం జరిగింది. వీటిలో ద్వితీయ ప్రణాళికాంతానికి 283 బ్లాకులలో పని జరుగుతున్నది. ప్రజా బాహుళ్యంలో ఉన్న ఉత్సాహాన్ని సహకార బుద్ధిని, సంపూర్ణంగా ఉపయోగించుకోవాలనే ఉద్దేశంతో 1959 నవంబరు మొదటి తేదీ నుండి పంచాయతీ సమితుల స్థాపన శీఘ్రంగా జరుగుతున్నది. గిరిజన ప్రాంతాలలో తప్ప తక్కిన ప్రథమ, ద్వితీయ స్థాయిలలోని బ్లాకుల కన్నిటికీ యీ పంచాయతీ సమితు లేర్పడుతున్నవి. అన్ని జిల్లాలలోను జిల్లా పరిషత్తులు పనిచేస్తున్నవి. కేంద్ర ప్రభుత్వం తయారు చేసిన కార్యప్రణాళిక ప్రకారం 1963 అక్టోబరు నాటికి సమాజాభి వృద్ధి

బ్లాకులు మన రాష్ట్రమంతటా యేర్పడవలసివున్నది. మూడవ ప్రణాళికా కాలంలో ప్రారంభమయ్యే బ్లాకులు 162. రూ. 25.50 కోట్లు యీ ఉద్యమానికి మూడవ ప్రణాళికలో కేటాయించబడ్డది. ఇందులో యీ యేడు, అంటే 1961-62 లో, రూ. 447.43 లక్షలు ఖర్చు కావలసి ఉన్నది. ఈ సంవత్సరం ప్రారంభింపబడే బ్లాకుల సంఖ్య 46.

సమాజాభివృద్ధి ఒక్క ఆర్థికబలం సమకూర్చటంతోనే అయిపోదు. అనేక రూపాల్లో ఆ అభివృద్ధి జరగవలసివుంది. కాని యిప్పటి మన గ్రామాల పరిస్థితిని బట్టి గ్రామ ప్రజల పేదరికం చూస్తే, అన్నిటికంటె ముందు వారి ఆర్థిక స్తోమత పెంపొందించటం మీద సర్వశక్తులూ కేంద్రీకరించవలెనని తోస్తుంది. వారికి సరియైన జీవన స్థాయి కుదర్చటం ప్రప్రథమ కర్తవ్యం. కాని అది ముఖ్యంగా వారి ప్రయత్నము మీదే రావలసిన ఫలితం. వారి సమస్యలేవో విడదీసి చెప్పి వాటిని యెదుర్కొని జయించే మార్గాలు చూపించటమే నిపుణులూ, నాయకులూ అయిన వారి పని.





ఉయ్యూరు చక్కెర కర్మాగారము

# సహకార వ్యవస్థ

రెండవ ప్రణాళికలో కంటె మూడవ ప్రణాళికలో సహకారోద్యమానికి రెట్టింపు కంటె ఎక్కువగా ప్రాముఖ్యత యివ్వబడ్డది. రెండవ అఖిలభారత ప్రణాళికలో రు 34 కోట్లుమాత్రమే ఇందుకై వెచ్చింపబడగా, మూడవ ప్రణాళికలో కేటాయింపు రూ 80 కోట్లు. ఋణాలు, వస్తుసేకరణ, విక్రయం మొదలైన వ్యాపారాలకే కాకుండా శ్రామికులు, కొనుగోలుదారులు మొదలైన వారికిగూడా ఏర్పడే సహకార సంఘాల విషయమై నిర్ణీతమైన కార్యక్రమం మూడవ ప్రణాళికలో విశదీకరింపబడ్డది.

మొదటి రెండు ప్రణాళికల కాలంలో ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘాల సంఖ్య 105,000 నుండి 210,000 వరకూ పెరిగింది. వాటిలో సభ్యుల సంఖ్య 55 లక్షల నుండి 170 లక్షల వరకూ పెరిగింది. ఈ పదేళ్లలో ఆ సంఘాలు కర్షకుల

కిచ్చిన ఋణాలమొత్తం 23 కోట్ల రూపాయలనుంచి 200 కోట్ల వరకు పెరిగింది. ఈ అభివృద్ధి మొదటి ప్రణాళికలో కంటె రెండవ ప్రణాళికలో తీవ్రతరంగా సాగింది. దీర్ఘ కాలానికిచ్చే ఋణాలవిషయంలో గూడా ద్వితీయ ప్రణాళికాకాలం నుంచి అభివృద్ధి చూపింది. అలాంటి ఋణాలమొత్తం 13 కోట్ల రూపాయలనుండి 34 కోట్ల వరకూ పెరిగింది.

మూడవ ప్రణాళికలో యీ పరపతి సంఘాల అభివృద్ధికి ముఖ్యోద్దేశం కావలసిన వ్యవసాయోత్పత్తి లక్ష్యాలను సాధించటానికి సహకరించటమే. ఈ లక్ష్యాలు చాలా పెద్దవి. అందుకని సహకారోద్యమంకూడా అంతపెద్ద ఎత్తులో పెంపొందాలి. ప్రాథమిక సహకార సంఘాల సంఖ్య 230,000 వరకూ పెరగవలసివుంది. దేశంలో వున్న గ్రామాలన్నిటికీ యీ సంఘాలు ఉపకరించగలవు. వీటిలో సభ్యులసంఖ్య 370 లక్షల వరకూ ఉంటుంది. దేశంలో వ్యవసాయం చేసే జనంలో నూటికి 60 మంది వరకూ యీ సంఘాల నుండి అప్పులు తీసుకోగలుగుతారు. ఈ అప్పులు, స్వల్పకాల వ్యవధివి, మధ్యరకాలవి కలసి రూ 530 కోట్లు. దీర్ఘకాల వ్యవధివి రూ. 150 కోట్ల వరకూ ఉండవచ్చు.

క్రొత్త సంఘాలమాట అట్లా ఉండగా, అదివరకే పనిచేస్తున్న వాటిని ఇంకా బాగుపరిచే అగత్యం ఎంతో ఉన్నది. రెండో ప్రణాళిక మొదట్లో ఉన్న 160,000 ప్రాథమిక సంఘాల్లో చాలాభాగం నిర్జీవంగా ఉండేవి. వాటిలో 42,000 సంఘాలకు గత ఐదేండ్లలో బలం చేకూర్చే కార్యక్రమం కొంతనడిచింది. మూడవ ప్రణాళికలో ఇంకా 52,000 సంఘాలను బాగుచేయాలని సంకల్పించారు. ఈ సంఘాలలో సభ్యుల సంఖ్య పెంచటం, గ్రామాలలో పొదుపు ఉద్యమాన్ని ప్రోత్సహించటం, ఇచ్చే ఋణాలు ఉత్పత్తికి విక్రయానికితోడ్పడేటట్లు చూడటం, సరియైన పరివేక్షణ మొదలైన కార్యక్రమం నిరాఘాటంగా సాగితేనే నిజమైన అభివృద్ధి కనబడుతుంది.

ప్రభుత్వం యిచ్చే వాటాలు వదిలేసి, ప్రాథమిక సంఘాల మూలధనం 1959-60 లో రూ. 42 కోట్లు ఉండేది. అది మూడవ ప్రణాళిక కొనసాగేటప్పటికి, అంటే 1965-66 కి రూ. 85 కోట్లవరకు పోవాలి. కేంద్రసహకార బ్యాంకులలో

ఇది రూ. 23 కోట్ల నుండి 62 కోట్లకు, ఎపెక్స్ బ్యాంకులలో రూ. 9 కోట్ల నుండి రూ. 33 కోట్లకు పెరగాలి. ఇదే కాలంలో ప్రాథమిక సంఘాలలో డిపాజిట్లు రూ. 12 కోట్ల నుండి రూ. 42 కోట్లకు, సెంట్రల్ బ్యాంకులలో రూ. 95 నుండి రూ. 212 కోట్లకు, ఎపెక్స్ బ్యాంకులలో రూ. 60 కోట్ల నుండి 142 కోట్లకు వృద్ధిచెందవలసి వుంది.

దీర్ఘకాల ఋణాలు చాలావరకు భూమితనఖా బ్యాంకులవల్ల లభించాలి. రెండవ ప్రణాళిక పూర్తి అయ్యే వరకు ఇంచుమించు రాష్ట్రాలన్నిటిలో అలాంటి బ్యాంకులు కేంద్రస్థాయిలోగాని ఎపెక్స్ బ్యాంకులకు శాఖలుగాగాని ఏర్పడ్డవి. 1959-60 లో 407 ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులున్నవి. ఇవిగాక మూడవ ప్రణాళికలో 265 బ్యాంకులు స్థాపించవలసివుంది.

సహకార వ్యవస్థను పటిష్ఠం చేయడంలో రిజర్వుబ్యాంకు మొదటి రెండు ప్రణాళికలలో చాలాసహాయం చేసింది. సహకార బ్యాంకులకు అడ్వాన్సు లిచ్చే వివిధ ఆర్థిక సంస్థలపనిని పర్యవేక్షిస్తూ, శిక్షణావకాశాలు కలగజేస్తూ, సహకార బ్యాంకుల మూలధనంలో వాటాలు కొంటానికి రాష్ట్రాలకు అప్పులిస్తూ, అనేక విధాల రిజర్వుబ్యాంకు తోడ్పడింది. మూడవ ప్రణాళికాకాలంలో దీని పాత్ర ఇంకా విస్తృతం అవుతుంది. స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియాకూడా సహకార సంస్థలకు ఇంకా ఎక్కువగా సహాయం చేయగలుగుతుంది.

ఉత్పత్తి అయిన పదార్థాలు సహకార పద్ధతిలో విక్రయించటం, కర్షకులకు కావలసిన పనిముట్లు మొదలైనవి సమకూర్చటంగూడా అదేపద్ధతిలో జరపటం లాభదాయకమని ఇప్పుడందరూ గ్రహించారు. అందువల్ల ప్రాథమిక విక్రయ సంఘాలుగూడా విరివిగా ఏర్పడుతున్నవి. రెండవ ప్రణాళికా కాలములో అలాంటివి 1869 సంఘాలకు నేషనల్ కో ఆపరేటివ్ డెవలప్‌మెంటు అండ్ వేర్‌హౌసింగ్ బోర్డు ద్వారా సహాయం లభించింది. మూడవ ప్రణాళిక క్రింద ఇంకా 600 వరకు మార్కెటింగు సంస్థలు నెలకొల్పవలసి వున్నది. అప్పుడు దేశంలో ఉన్న 2500 మార్కెట్లలో ప్రతిదానికి చేరువగా ఒక సహకార సంఘం ఉంటుంది. ఇవిగాక చెరకుసప్లయి సంఘాలు, పాలసరఫరా సంఘాలు మొదలైన వెన్నో ఏర్పడుతున్నవి.

వ్యవసాయదారులకు కావలసిన వస్తువులను సప్లయిచేయటంలో విక్రయ సంఘాలు ఇప్పుడు రు. 200 కోట్ల వరకు వ్యాపారం సాగిస్తున్నట్లు అంచనా

వేయబడ్డవి. ఉత్పత్తి అయిన సరుకుల అమ్మకం దాదాపు రు. 400 కోట్ల వరకూ ఉంటుంది. ఆహార ధాన్యాలు, వ్యాపారపు పంటల విషయంలో అమ్మదగిన దాంట్లో ఇంకా ఎక్కువ పాలు యీ సహకార సంస్థల ద్వారా విక్రయించటానికి మూడవ ప్రణాళికలో ప్రయత్నాలు జరుగుతవి. ఎగుమతి వ్యాపారంలో గూడా సహకార సంస్థలకు భాగం ఉండాలి. ధరలను అదుపులో ఉంచే చర్యలవల్ల గూడా యీ సహకార సంఘాల కార్యక్రమానికి తోడ్పాటు కలుగుతుంది. ఇప్పుడు నేషనల్ కో ఆపరేటివ్ డెవలప్‌మెంటు అండ్ వేర్ హౌసింగ్ బోర్డు వారి ఆధ్వర్యాన పరిశీలనలో వున్న సమస్యలలో కొన్ని పశ్చిమ బెంగాలులోని జనుము, రాజస్థానంలోని గోధుమలు, ఆంధ్రప్రదేశ్‌లోని వడ్లు సహకార మార్గంలో విరివిగా విక్రయించటాన్ని గూర్చి.

రెండవ ప్రణాళిక క్రింద నిర్మింపబడిన 1670 గోదాములు గాక, మూడవ ప్రణాళికా కాలంలో 980 గోదాములు ఏర్పాటు కాగలవు. గ్రామీణ ప్రాంతాల్లో ఉన్న 4,100 గోదాములు కాక అదనంగా 5,100 ఏర్పాటు చేస్తారు. 1960–61 సంవత్సరానికి దేశంలో సహకారరంగంలో ఏర్పడ్డ 41 పంచదార మిల్లులలో 30 పని ప్రారంభించినవి. మూడవ ప్రణాళికా కాలంలో ఇంకా 25 మిల్లులు స్థాపించవచ్చు. వీటికి ముఖ్యంగా సహాయకారి ఐనది - ఇండస్ట్రియల్ ఫైనాన్స్ కార్పొరేషన్. ఇదే మాదిరి ఇతర పదార్థాలు తయారుచేసే సహకార సంస్థలు 378 కి రెండవ ప్రణాళిక క్రింద సహాయం లభించింది. వీటిలో బియ్యం మరలు, నూనె మరలు, వేరుశనగ మరలు మొదలైనవి ఉన్నవి. ఇలాంటివి ఇంకా 783 మూడవ ప్రణాళిక క్రింద నెలకొల్పబడతవి.

సహకార వ్యవసాయం విషయమై విపరీతంగా చర్చలు జరిగినప్పటికీ, మన దేశపు పరిస్థితులలో యీ మార్గం ప్రయోజనకరమైనదని నిశ్చయించి, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తగు చర్య తీసుకుంటున్నవి. కేంద్రంలో సహకార శాఖ వారు ఒక సలహా బోర్డును ఏర్పరిచారు. ఇలాంటివే కొన్ని రాష్ట్రాలలో గూడా ఏర్పడ్డవి. దేశమంతటా పైలట్ పథకాలుగా 3,200 సహకార వ్యవసాయ సంఘాలు స్థాపించాలని సూచింపబడ్డవి. ఇందులో మూడవ ప్రణాళిక మొదటియేడు ఇలాంటి పథకాలు 65 జిల్లాలలో ప్రారంభించ బడుతున్నవి. ఇవిగాక సహకార సూత్రం మీద పారిశ్రామిక సంఘాలు, గృహ నిర్మాణ సంఘాలు, కొనుగోలుదార్ల సంఘాలు

మొదలయినవి ఏర్పడి పనిచేస్తున్నవి. వీటన్నిటినీ ఇతోధికంగా వృద్ధిచేయటానికి మూడవ ప్రణాళికలో అవకాశం ఏర్పరిచారు. సహకారోద్యోగుల శిక్షణకై ఇప్పుడున్న ఒక కళాశాల, 13 ప్రాంతీయ కేంద్రాలు, 62 ఇతర కేంద్రాలు కాక, మూడవ ప్రణాళికలో 3 శిక్షణా కేంద్రాలను నెలకొల్పాలని రాష్ట్రాలు ప్రతిపాదించినవి. ప్రాంతీయ కేంద్రాలు మొదలైన వాటిని గూడా ఇంకా హెచ్చించే సూచనలు కొన్ని కేంద్ర ప్రభుత్వ పరిశీలనలో ఉన్నవి.

ఆంధ్రప్రదేశ్ మూడవ ప్రణాళికలో సహకారోద్యమ వ్యాప్తికి రు. 580 లక్షలు కేటాయించబడ్డవి. దీంట్లో రు. 100.57 లక్షలు యీ ప్రణాళిక మొదటి యేడు, అంటే 1961-62 లో ఖర్చవుతవి.

రెండవ ప్రణాళికా కాలంలో 6,000 చిన్న గ్రామీణ పరపతి సంఘాలకు బలం చేకూర్చటానికి ప్రయత్నం జరిగింది. ఈ మూడో ప్రణాళికలో ఇంకా 4,000 సంఘాలకు సహాయం లభిస్తుంది. ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘాల సభ్యుల సంఖ్య 20 లక్షల నుండి 40 లక్షలకు వృద్ధిచేయబడుతుంది. రాష్ట్రంలో వున్న గ్రామీణ కుటుంబాల సంఖ్యలో ఇది మూడింట రెండు వంతులు.

ఈ రాష్ట్రంలోని కర్షకులకు మూడవ ప్రణాళిక ఆఖరయ్యే సమయానికి ప్రతి యేడూ రు. 200 కోట్ల వరకూ ఋణాలు అవసరమవుతవని అంచనా వేయబడినది. ఇప్పటి ప్రయత్నాన్ని బట్టి సహకార సంఘాల ద్వారా అందులో రు. 66 కోట్ల వరకు ఆ ఋణాలు లభించేటట్లు చూడగలము. నాలుగవ ప్రణాళిక అంతానికల్లా కర్షకులకు కావలసిన అప్పులో సగభాగం సహకార మార్గాన లభిస్తుంది. కేంద్ర సహకార బ్యాంకుల శాఖలు 50 వరకు విక్రయ సహకార సంఘాల కేంద్రాలలో రెండవ ప్రణాళిక క్రింద స్థాపించబడతవి. మూడవ ప్రణాళికలో ఇంకా 20 స్థాపించబడతవి. క్రొత్త ప్రాథమిక విక్రయ సంఘాలు 40 నెలకొల్పటమేకాక, 70 సంఘాల మూల ధనానికి ఒక్కొక్కదానికి రు. 250,000 చొప్పున ప్రభుత్వం ఇస్తుంది. కేంద్ర విక్రయ సమాఖ్యకు ఇంకా రు. 2 లక్షలు గూడా ప్రభుత్వం ఇస్తుంది. సహకార సంఘాలు 65 ముఖ్య గోదాములు, 600 గ్రామీణ గోదాములు నిర్మించటానికి సహాయం లభిస్తుంది. విక్రయ సహకార సంఘాలు ఇంకా 50 ఉత్పత్తి కేంద్రాలు గూడా స్థాపించగలుగుతవి. మూడవ ప్రణాళికా కాలంలో రెండు

'కోల్డు స్టోరేజ్'లు గూడా ఏర్పడతవి. వీటిలో ఒక్కొక్క దానికి రు. 4 లక్షలు ఖర్చు కాగలదు. ఒక గ్రేడింగు సంస్థ కూడా ఏర్పడుతుంది.

సహకార వ్యవసాయానికై రాష్ట్ర తృతీయ ప్రణాళికలో రు. 40 లక్షలు కేటాయించారు. 20 పైలట్ పథకాల క్రింద జిల్లాకు పది సంఘాల చొప్పున 200 సంఘాలు నెలకొల్పుతారు. తక్కినచోట్ల గూడా వీలైనన్ని సహకార సంఘాలు బైలుదేరటానికి, సహకార వ్యవసాయంలో శిక్షణా సౌకర్యాలకూ అవకాశం ఉంది. ప్రతి జిల్లాలో అనధికార కార్యకర్తలను తర్ఫీదుచేయటానికి ఒక కేంద్రం స్థాపించబడుతుంది. వీటిలో ఒక లక్ష వరకు మానేజింగ్ కమిటీ సభ్యులు 20,000 కార్య నిర్వాహకులు శిక్షణ పొందుతారు.





శ్రీశైలం జల విద్యుచ్ఛక్తి ప్రాజెక్టు స్థలం

# విద్యుచ్ఛక్తి

శీఘ్రగతిని దేశం పారిశ్రామికాభివృద్ధి పొందాలంటే విద్యుచ్ఛక్తి ఎంతో అవసరం. ఒక విధంగా ఈ శతాబ్దాన్ని విద్యుచ్ఛక్తి యుగం అనవచ్చు. ఇంటా బయటా కూడా ఈ 'శక్తి' మనకు అనేక విధాల ఉపయోగపడుతున్నది.

బొగ్గు, లిగ్నైట్, జలపాతాలు, యురేనియం, థోరియం, నూనె, సహజ వాయువులు - మొదలైన మూలవసతుల నుండి విద్యుచ్ఛక్తిని తయారు చేయవచ్చును. రిఫైనరీ గ్యాసులు, సముద్ర తరంగాల శక్తి, వాయు శక్తి, భూమి ఉష్ణ శక్తి, సూర్యరశ్మి ద్వారా కూడా విద్యుచ్ఛక్తిని సాధింపవచ్చును. ఈ అన్నిటినీ ఉపయోగించుకునే సామర్థ్యం మరికొన్ని ప్రణాళికలు అమలు పరచుకొన్న తరువాత మనం సాధింపగలము.

జలవిద్యుచ్ఛక్తి ఉత్పత్తి మామూలుగా చౌక. ఎందుకంటె ఇంధనముతో అవసరం లేదు. అయితే జలవిద్యుచ్ఛక్తి కేంద్రాలను నెలకొల్పటానికి చాలా కాలం

పట్టుతుంది. విదేశీ మారక ద్రవ్యంతో ఎక్కువ అవసరం లేక పోయినా వ్యయం మట్టుకు ఎక్కువగానే వుంటుంది. రైల్వేలకు, పరిశ్రమలకు పనికిరాని తక్కువ రకం బొగ్గు, గనులవద్ద బొగ్గు వాషరీస్ వద్ద విస్తారంగా లభిస్తుంది. ఈ ప్రాంతాలు బొగ్గు విద్యుచ్ఛక్తి కేంద్రాల స్థాపనకు పనికి వస్తాయి. నూనె ద్వారా (డీసెల్ నూనె గాని లేక ఫర్నేస్ నూనెగాని) విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయటం బొగ్గు విద్యుచ్ఛక్తికన్న. జలవిద్యుచ్ఛక్తికన్న చాలా ఖర్చుతో కూడుకొన్నట్టిది. అసలు డీసెల్ నూనె కూడా తగినంత లభించటం లేదు. దిగుమతి చేసుకొనవలసి వస్తోంది. కొబట్టి ఈ రకం ఉత్పత్తిని ముఖ్యంగా మారుమూల ప్రదేశాలకు గాని లేక చిన్న ప్రయోగాత్మక పథకాలకు గాని పరిమితం చేయవలసి వుంటుంది. ఇటీవల న్యూక్లియర్ శక్తికి ప్రత్యేక ప్రాముఖ్యం హెచ్చింది. దేశంలో కొత్తగా యురేనియం దొరికే చోట్లు కనుగొనబడ్డాయి. ఈ యురేనియం డిపాజిట్లు, ప్రపంచంలో కెల్లా ఉత్తమంగా పరిగణింపబడే థోరియం డిపాజిట్లు కలసి న్యూక్లియర్ శక్తిని విస్తారంగా సమకూర్చగలవు. బొగ్గు గనులకు దూరంగా ఉండి చౌక అయిన జలవిద్యుచ్ఛక్తి లభించనట్టి ప్రాంతాల్లో న్యూక్లియర్ కేంద్రాలు ఏర్పాటు చేయవచ్చు.

జలవిద్యుచ్ఛక్తి, బొగ్గు విద్యుచ్ఛక్తి, డీసెల్ విద్యుచ్ఛక్తి కేంద్రాల్లో విద్యుచ్ఛక్తి ఉత్పత్తికయ్యే సగటు ఉత్పత్తి ఖర్చు వరుసగా కిలోవాట్ - గంటకు ఈ విధంగా ఉంటుంది. 1. 2 నయా పైసా, 3 న.పై. 25 న. పై మొదటి ప్రణాళిక ఆరంభకాలం నాటికి దేశంలో మొత్తం విద్యుదుత్పాదన శక్తి 2.3 మిలియన్ కిలోవాట్లు. ఇందులో 1.71 మిలియన్ కిలోవాట్లు ప్రభుత్వ ప్రైవేటు రంగాల్లోని విద్యుచ్ఛక్తి సరఫరా సంస్థలకుచెందినట్టివి. 0.59 మిలియన్ కిలోవాట్లు పారిశ్రామికసంస్థలు స్వయంగా తయారు చేసుకొన్నవి. మొదటి ప్రణాళిక చివరకు మొత్తం ఉత్పత్తి నలభై తొమ్మిది శాతం పెరిగింది. అంటే 3.42 మిలియన్ కిలోవాట్లు అయింది.

రెండవ ప్రణాళిక లక్ష్యం సత్వర పారిశ్రామికాభివృద్ధి. ముఖ్యంగా ప్రాతిపదిక పరిశ్రమల, భారీ పరిశ్రమల అభివృద్ధి. కాబట్టి విద్యుచ్ఛక్తి అభివృద్ధికి తదనుగుణంగా ప్రాధాన్యం ఇవ్వబడినది. దేశంలో ఇంచుమించు అన్ని ప్రాంతాల్లోనూ విద్యుచ్ఛక్తికి గిరాకీ చాలా హెచ్చింది. అవసరానికి తగినంతగా విద్యుచ్ఛక్తి లేదు. అంటే అవసరం కన్న ఉత్పత్తి వెనుకబడిందన్న మాట. రెండవ ప్రణాళిక ప్రారంభం నాటికి మొత్తం ఉత్పాదన శక్తి 3.4 మిలియన్ కిలోవాట్లు వున్నది.

ఇందులో 2.7 మిలియన్ కిలోవాట్లు ప్రభుత్వ ప్రైవేటు రంగాల్లోని విద్యుచ్ఛక్తి సరఫరా సంస్థలకు చెందినట్టివి. 0.7 మిలియన్ కిలోవాట్లు పారిశ్రామిక సంస్థలు స్వయంగా ఉత్పత్తి చేసుకున్నవి రెండవ ప్రణాళిక ముగిసేటప్పటికి మొత్తం ఉత్పత్తి అరవయ్యేడు శాతం పెరిగింది. అనగా 5.70 మిలియన్ కిలోవాట్లకు పెరిగింది. రెండవ ప్రణాళిక తొలి లక్ష్యం అదనంగా 3.48 మిలియన్ కిలోవాట్ల ఉత్పత్తి అయితే అదనంగా చివరకు ఉత్పత్తి చేయగలిగింది. 2.28 మిలియన్ కిలోవాట్లు. ఇందుకు ముఖ్యకారణాలు. రెండవ ప్రణాళిక తొలిసంవత్సరాల్లో తలెత్తిన విదేశీ ద్రవ్యమారకపు ఇబ్బందులు, భాక్రానంగల్, కొయినా, రిహాండ్, హిరాకుడ్ వంటి భారీ జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టులు కొన్ని పూర్తి అవటానికి కొంతవరకు ఆలస్యం జరగటం. మూడవ ప్రణాళిక తొలి సంవత్సరాల్లో విద్యుచ్ఛక్తి తరుగుగా వుండకుండా చూసేందుకై విదేశీ ద్రవ్యమారకాన్ని సమకూర్చటానికి తగిన చర్యలు తీసుకొనబడినాయి.

మొదటి ప్రణాళికలో విద్యుచ్ఛక్తిపై వ్యయం ప్రభుత్వ రంగంలో రు 260 కోట్లు వుంది. ప్రైవేటు రంగంలో రూ 32 కోట్లు వుంది. స్వంతంగా విద్యుచ్ఛక్తిని తయారు చేసుకుంటున్న పారిశ్రామిక సంస్థలు మొదటిప్రణాళికా కాలంలో అదనంగా సుమారు 10 కోట్లు వ్యయం చేసినై. రెండవ ప్రణాళికా కాలంలో విద్యుచ్ఛక్తిపై వ్యయం ప్రభుత్వ రంగంలో రూ 525 కోట్లు. ప్రైవేటు రంగంలో రు 460 కోట్లు. రెండవ ప్రణాళికలో విద్యుచ్ఛక్తి ఉత్పత్తిపై మొత్తం వ్యయం రూ 1017 కోట్లు.

విద్యుచ్ఛక్తి అభివృద్ధికి పారిశ్రామికాభివృద్ధికి ప్రత్యక్ష సంబంధంవున్నదని మనకు తెలుసును. వినియోగమయ్యే విద్యుచ్ఛక్తిలో 75 శాతం కన్న ఎక్కువ భాగం పారిశ్రామికోత్పత్తికి తదితర ఉపయోగాలకు వినియోగమవుతోంది. ప్రాతిపదిక భారీ పరిశ్రమలకు మూడవ ప్రణాళికలోనూ ప్రాముఖ్యం చూపబడుతుంది. అంటే విద్యుచ్ఛక్తి విషయంలోనూ ముందు చూపుతో 'ప్లాన్' వేసుకోవలసి వుంటుంది. తృతీయ ప్రణాళికాంతానికి విద్యుచ్ఛక్తి ఉత్పాదన శక్తి 13.40 మిలియన్ కిలోవాట్లకు పెంచడమవుతుంది. అంటే ఉత్పత్తి రెండో ప్రణాళికతో పోల్చిచూస్తే 123 శాతం పెరుగుతుంది.

మూడవ ప్రణాళికలో విద్యుచ్ఛక్తి వ్యయం రు 1089 కోట్లు ఉంటుంది. -(రూ 1039 కోట్లు ప్రభుత్వ రంగంలోనూ, 50 కోట్లు ప్రైవేటు రంగంలోనూ) -

ప్రభుత్వ రంగంలో జలవిద్యుచ్ఛక్తి, థర్మల్ ఉత్పాదక పథకాలకు సుమారు రు 661 కోట్లు, అణుశక్తికి రు 51 కోట్లు, ప్రసారానికి పంపిణీకి గ్రామీణ విద్యుచ్ఛక్తికి రు 327 కోట్లు కేటాయించబడినవి. మూడవ ప్రణాళికలో విద్యుచ్ఛక్తి కార్యక్రమానికి విదేశీ ద్రవ్య మారకం రు 320 కోట్లు అవసరం ఉంటుందని అంచనా వేయబడింది.

విద్యుచ్ఛక్తి ఉత్పత్తి పెరిగితే కుటీర పరిశ్రమలూ, చిన్న పరిశ్రమలూ కూడ అభివృద్ధి పొందడానికి అవకాశం ఎక్కువ. గ్రామ ప్రాంతాలకు ఇతోధింగా విద్యుచ్ఛక్తి అందజేయడానికి మూడవ ప్రణాళికలో ఏర్పాట్లు చేయబడినవి. మొదటి ప్రణాళిక పూర్తయ్యేటప్పటికి భారత దేశంలో 7400 గ్రామాలకు, పట్టణాలకూ విద్యుచ్ఛక్తి లభ్యమవుతూండేది. రెండో ప్రణాళిక ముగిసేటప్పటికి ఈ సంఖ్య 23,000 కు పెరిగింది. మూడవ ప్రణాళిక లక్ష్యం మరొక 20,000 గ్రామాలకు పట్టణాలకూ విద్యుచ్ఛక్తి సరఫరా చేయటం. దీని అంచనా ఖర్చు రూ 105 కోట్లు.

మారుమూల ప్రాంతాలు దేశంలో అనేకం వున్నాయి. వీటిలో ఒక మాదిరి ఖర్చుతో జలవిద్యుచ్ఛక్తి కేంద్రాలను 10 నుంచి 100 కిలోవాట్ల శక్తిగల వాటిని ఏర్పాటు చేయవచ్చును. 100 కిలోవాట్ల వరకు శక్తివున్న చిన్న జలవిద్యుచ్ఛక్తి యంత్రాలు దేశంలోనే ఇప్పుడు తయారవుతున్నాయి. కాలక్రమేణ డీసెల్ అల్టర్నేటర్ సెట్లకన్న తక్కువఖర్చుతో నడుపుకోవచ్చు. నిర్వహణకూడా వాటికన్న సులభం. యంత్రసామగ్రికి గాని, నడపటానికి గాని విదేశీ ద్రవ్యమారకం అవసరం ఉండదు. పరిశీలనలు జరుపటానికి అట్టి కేంద్రాల స్థాపనకు పూనుకొని తోడ్పడటానికై కేంద్ర జలవిద్యుచ్ఛక్తి సంస్థలో ఒక ప్రత్యేక కేంద్రం ఏర్పాటు చేయబడింది. ఈ రకమైన విద్యుచ్ఛక్తి అభివృద్ధిపట్ల ప్రత్యేక శ్రద్ధను చూపాలని తగిన కార్యక్రమాలను రూపొందించాలని రాష్ట్ర ప్రభుత్వాలకు సూచన వచ్చింది.

ఆంధ్రప్రదేశ్‌లో తలసరి వినియోగం 15 యూనిట్లు మాత్రమే. మొత్తం దేశానికి ఈ సంఖ్య 35 యూనిట్లు. మన రాష్ట్రంలో మూడు మిలియను కిలోవాట్ల జలవిద్యుచ్ఛక్తి ఉత్పత్తికి అవకాశం వుంది. బొగ్గు నాలుగువేల మిలియను టన్నుల వరకూ ఇక్కడ దొరుకుతుందని అంచనా.

ఆంధ్ర ప్రాంతంలో మొదటి ప్రణాళిక కాలంలో 476 గ్రామాలూ, పట్నాలూ అదనంగా విద్యుచ్ఛక్తి సదుపాయం పొందాయి. తలసరి వినియోగం

కూడా 2.5 యూనిట్ల నుండి 7 యూనిట్లకు పెరిగింది. అయితే యీ కాలంలో తెలంగాణములో 19 గ్రామాలకు మాత్రమే విద్యుచ్ఛక్తి లభించింది. రెండో ప్రణాళికా కాలంలో మొత్తం ఆంధ్రప్రదేశ్‌లో విద్యుచ్ఛక్తికి రూ. 3285.76 లక్షలు కేటాయించబడినవి. రెండో ప్రణాళికా కాలంలో చేపట్టిన ముఖ్య పథకాలు మాచ్‌ఖండ్, తుంగభద్ర, ఎగువ శీలేరు జలవిద్యుత్ పథకాలు. తెలంగాణాలో థర్మల్ పథకాలు కొన్ని చేపట్టబడినవి. ఈ పథకాలు అమలు చేయడం వల్ల మొత్తం ఉత్పత్తి 128;820 కిలోవాట్లకు పెరిగింది. తలసరి వినియోగం 15 యూనిట్లకు పెరిగింది.

మూడో ప్రణాళికా కాలంలో రు 64.94 కోట్ల ఖర్చుతో పద్దెనిమిది పథకాలు అమలు జరపటానికి నిశ్చయించడమైనది. అదనంగా 925 గ్రామాలకు విద్యుచ్ఛక్తి లభిస్తుంది. మూడో ప్రణాళిక తొలిసంవత్సరంలో రు 10 కోట్లు ఖర్చు చేయబడుతవి.

1960-61 సంవత్సరంలో ద్వితీయ ప్రణాళికలోని విద్యుత్పథకాలకు రూ 359.84 లక్షల ఖర్చు కేటాయించబడింది. వీటిలో ప్రధానమైనది ఒకటి ఎగువ సీలేరు పథకం. ప్రథమ దశలో ఒక్కొక్కటి 60 వేల కిలోవాట్ల శక్తిగల ఉత్పాదక యంత్రాలు రెండిటిని నది ఎగువ భాగంలో ఏర్పాటు చేయాలని సంకల్పం. ఈ పథకం సమగ్రపరిశీలన పూర్తి అయింది. రాకపోకల సౌకర్యాలు, వసతి సౌకర్యాలకు సంబంధించిన ప్రాథమిక కార్యకలాపాలు జరుగుతున్నవి. శ్రీశైలం జల విద్యుత్పథకం మరొక ముఖ్యమైన పథకం.

అభ్యుదయ కాంతిపథంలో రాష్ట్రాన్ని, దేశాన్ని నడపటానికి ఉపయోగపడే విద్యుచ్ఛక్తి ఉత్పత్తి ముందుముందు సంవత్సరాల్లో ఇంకా పెరుగుతుంది.





వివేకానందోన్నత పాఠశాల, గిద్దలూరు, కర్నూలు జిల్లా

# విద్యావ్యాప్తి

నేటి ప్రపంచంలో విద్యలేని మానవ వ్యక్తి ఉండనే కూడదు. కేవలం జీవయాత్ర చేయటానికి విద్య ఆవశ్యకం కాకపోవచ్చు వట్టి దేహబలంమీదే ఆధార పడి బ్రతుకంతా వెళ్ళబుచ్చగలవారు ఇప్పుడు కూడా చాలామంది ఉండవచ్చు. కాని, ఏ మార్గాన జీవనం చేసేవారైనా సంఘానికీ, దేశానికీ, రాజ్యానికీ సంబంధించిన బాధ్యతలు కొన్ని నిర్వర్తించవలసి ఉంది. వాటిని అర్థంచేసుకోటానికి సామాన్య విద్య అవసరం. తర్వాత, ఎంత శరీర బలంమీద ఆధారపడిన వృత్తి అయినా, నేటి సాంకేతికయుగంలో కొద్దో గొప్పో శాస్త్రీయజ్ఞానం లేకుండా కొత్తకొత్త పరికరాల ఉపయోగాన్ని గమనించకుండా చాలాకాలం నడవలేదు. అందులో పనిచేసేవారు పోటీకి నిలబడి బాగుపడాలంటే కాలక్రమేణ ఆ ప్రత్యేక రంగంలో వచ్చే పరివర్తన లను గమనిస్తూ మారుతున్న అవసరాలకు అనుగుణంగా తమ వస్తూత్పత్తి విధా

నాలు కూడా మార్చుకుంటూ ఉండాలి. అందువల్ల ప్రతివారికి కొంతవరకు సామాన్య విద్య అత్యవసరం; కొంతమందికి సాంకేతిక విద్యలో శిక్షణ తప్పనిసరి అవుతుంది.

స్వాతంత్ర్యం వచ్చిందాక మన ముఖ్యాదర్శాల్లో ఒకటి దేశంలో ప్రజలందరికీ విద్యావకాశాలు కల్పించటం. గడచిన ప్రణాళికా దశాబ్దంలో ఇందుకు మంచి ప్రయత్నం జరిగింది. అన్ని రకాల పాఠశాలల సంఖ్య 230,555 నుండి 398,200 వరకు, అంటే 73 శాతం పెరిగింది. విద్యార్థుల సంఖ్య 235 లక్షల నుండి 435 లక్షల వరకు పెరిగింది. మొదటి ప్రణాళికలో రూ. 153 కోట్లు, రెండవ ప్రణాళికలో రూ. 256 కోట్లు యీ విద్యావిస్తరణ కార్యక్రమాలకు వెచ్చించ బడ్డవి. కాని దేశంలో అన్ని ప్రాంతాలకు సంతృప్తికరమైన విద్యాసౌకర్యాలు ఏర్పడలేదు. రెండేళ్ళ క్రింద యీ విషయమై జరిపిన పరిశీలన ఫలితంగా పాఠ శాలలు అందుబాటులేని ప్రదేశాలెన్నో ఉన్నట్లు తేలింది. 1957 లో గ్రామప్రాంతా లలో 29 శాతానికి, గ్రామీణ ప్రజలలో 17 శాతానికి పాఠశాలలు ఏర్పడలేదు. మూడవ ప్రణాళికలో యీ లోపం తీర్చవలసి ఉన్నది. పాఠశాలల సంఖ్య యీ అయిదేండ్లలో 24 శాతం, అంటే 494, 500 వరకు వృద్ధికావలసి ఉన్నది. క్రొత్తగా 73,000 ప్రాథమిక పాఠశాలలు, 15,100 మాధ్యమిక పాఠశాలలు, 5,200 ఉన్నత పాఠశాలలు ఏర్పడవలసి ఉంది. అలాగే విద్యార్థులసంఖ్య గూడా ఇప్పటికంటె 204 లక్షలు ఎక్కువ కావలసి ఉన్నది. గడచిన పదేండ్లలో ప్రాథమిక పాఠశాలలకంటె మాధ్యమిక, ఉన్నత పాఠశాలల స్థాపనలో ఎక్కువ ప్రగతి కనిపించింది. ప్రాథమిక విద్య తప్పనిసరిగా ప్రజలకందరికీ కావలసినది; కాబట్టి ప్రాథమిక పాఠశాలల స్థాపన యీలా వెనుకబడి ఉండ రాదు. మూడవ ప్రణాళికా కాలంలో 6-11 ఏండ్ల వయస్సుగల పిల్లలకందరికీ నిర్బంధ విద్య ఏర్పాటవుతున్నది. కాబట్టి చాలవరకీ ప్రాథమిక విద్యాలయాల స్థాపన శీఘ్రతరంగా సాగిపోగలదు. దీనితోపాటు తర్ఫీదుపొందిన ఉపాధ్యాయుల సంఖ్యగూడా వృద్ధిపొందవలసి ఉన్నది. పదేండ్లక్రింద ఉన్న ఉపాధ్యాయులలో 59 శాతం మాత్రమే అలాంటి సుశిక్షితులైనవారు ప్రాథమిక పాఠశాలలలో ఉండే వారు. రెండు ప్రణాళికల తర్వాత ఇది 65 శాతం ఐంది. ఇదే మాదిరి మాధ్యమిక పాఠశాలలలో అలాంటి ఉపాధ్యాయుల సంఖ్య 53 నుండి 65 శాతం వరకు, ఉన్నత పాఠశాలలలో 54 నుండి 68 వరకూ పెరిగింది. ఈ అంకెలనుబట్టి చూస్తే యీ అభివృద్ధి అంత ఉత్సాహజనకంగా కనిపించదు. కాబట్టి మూడవ ప్రణాళికలో

యీ పనికూడా ఇంకా పెద్ద ఎత్తున జరుగవలె. అన్ని రకాల పాఠశాలలలోను తర్ఫీదుపొందిన ఉపాధ్యాయుల సంఖ్య 75 శాతంవరకు పెరగవలసి ఉంది. ట్రెయినింగ్ స్కూళ్లు 1,307 నుండి 1,424 వరకు, కళాశాలలు 236 నుంచి 312 కి వృద్ధి పొందాలి.

విశ్వ విద్యాలయాలలోని విద్యార్థుల సంఖ్య కడచిన పదేండ్లలో ఇంచుమించు మూడురెట్లు పెరిగింది. కళలు, శాస్త్రవిజ్ఞానం, ఆర్థికవిద్య అభ్యసించే వారిసంఖ్య మొత్తం 1950 – 51 లో 360,000. అదే క్రిందటి యేడు 900,000 వరకూ పెరిగింది. ప్రణాళికల ప్రధానోద్దేశం ఆర్థికాభ్యున్నతి. అందుకై కొత్తగా ప్రారంభిస్తున్న అభివృద్ధి పథకాల సక్రమ నిర్వహణకు శాస్త్రవిజ్ఞానం ఎక్కువగా కావలసి ఉంది; మన కళాశాలలు ఇతోధికంగా శాస్త్రీయ విభాగాల్లో నిపుణులైన వారిని తయారు చేయవలసి ఉంది. రెండవ ప్రణాళికా కాలంలో అలాంటి విద్యార్థుల సంఖ్య 33 శాతంనుండి 36 శాతంవరకు పెరిగింది. మూడవ ప్రణాళికలో దీన్ని 42 శాతానికి పెంచవలెనని సంకల్పించారు. అంటే కొత్తగా విశ్వ విద్యాలయాలలో చదివే 400,000 మందిలో నూటికి 60 మంది అయినా సైన్సు కోర్సుల్లో చదవాలన్నమాట.

ఈ అన్ని విధాల సౌకర్యాల అభివృద్ధికి తృతీయ ప్రణాళికలో రు. 560 కోట్లు కేటాయించబడ్డవి. ఇదిగాక సమాజాభివృద్ధి కార్యక్రమం క్రింద కేటాయింపులలో విద్యకై వేరే రు. 37 కోట్లు ఉంది. ఇంకా రు. 42 కోట్లు వెనుకబడిన తరగతుల సంక్షేమానికై ఏర్పడ్డ కేటాయింపులో నుంచి వస్తుంది.

సాంకేతిక విద్య విషయంలో ప్రతి ప్రణాళిక వచ్చే దానికి ప్రాతిపదికగా ఉంటుంది. కాలక్రమేణా సాంకేతిక నిపుణుల అవసరం ఎక్కువ అవుతున్నది కాబట్టి, వీరిని తయారుచేసే అవకాశాలుకూడా ఎక్కువ కావాలి. మూడవ ప్రణాళికా కాలంలో కావలసిన నిపుణులు ఇదివరకే రెండవ ప్రణాళిక క్రింద ఏర్పడి పనిచేస్తున్న సంస్థల నుండి రావలసి ఉంది. అలాగే నాల్గవ ప్రణాళికా కాలానికి కావలసిన నిపుణుల కోసం ఇప్పుడు మూడవ ప్రణాళిక క్రింద నూతన సంస్థలను స్థాపించవలసి ఉంది. మూడవ ప్రణాళికలో విద్యకై కేటాయించిన రు. 560 కోట్లలో సాంకేతిక విద్యా పథకాలకు ప్రత్యేకించింది రు. 142 కోట్లు; అంటే 25 శాతం. మొదటి రెండవ ప్రణాళికలలో ఇది క్రమంగా 13,19 మాత్రమే.

దేశంలో ఇంజనీరింగు కళాశాలల సంఖ్య రెండవ ప్రణాళికా కాలంలో 65 నుండి 100 వరకూ పెరిగింది. వాటిలో ఏటేటా చేర్చుకునే విద్యార్థుల సంఖ్య 5,890 నుండి 13,860 వరకు హెచ్చింది. డిప్లొమాలకు తర్ఫీదిచ్చే పాలిటెక్నిక్‌లు 114 నుండి 196 అయినవి. వీటిలో విద్యార్థుల సంఖ్య 10,480 నుండి 25,570 అయింది. ఏటేటా ఉత్తీర్ణులయ్యే పట్టభద్రుల సంఖ్య 4,020 నుండి 5,700 వరకు, డిప్లొమా పొందినవారి సంఖ్య 4,500 నుండి 8,000 కు పైగా పెరిగినవి.



మూడవ ప్రణాళికా కాలంలో క్రొత్తగా 17 సాంకేతిక కళాశాలలు ఏర్పడతవి. వీటిలో 7 ప్రాంతీయ కళాశాలలు. 67 కొత్త పాలిటెక్నిక్‌లు గూడా తెరుస్తారు. ఒక్కొక్కదాంట్లో 180 పైగా విద్యార్థులకు స్థానం ఉంటుంది. ఇదిగాక, ఇప్పుడున్న సంస్థలలో గూడా ఇంకా ఎక్కువమందిని చేర్చుకోటానికి ఏర్పాట్లు జరుగుతవి.

ఆంధ్రప్రదేశ్ మూడవ ప్రణాళికలో విద్యావ్యాప్తికై కేటాయించిన సొమ్ము రు. 23.61 కోట్లు. దీంట్లో యీ యేడు ఖర్చయ్యేది రు. 317.55 లక్షలు.

ఉచిత నిర్బంధ ప్రారంభవిద్య రాష్ట్రంలో 6 నుండి 11 ఏండ్ల లోపల వయస్సుగల బాలురలో 95 శాతం వరకు, బాలికలలో 70 శాతం వరకు లభించేటట్టు చేయటం మూడవ ప్రణాళికలో ఒక ముఖ్యోద్దేశం. 11 నుండి 14, 14 నుండి 17 వరకు వయస్సుగల వారికి కూడా విద్యాసౌకర్యాలు వృద్ధిచేయాలి. రాష్ట్రంలో 400 సెకండరీ స్కూళ్ళను హైయర్ సెకండరీ స్కూళ్లగా మార్చటం, ప్రాంతానికీ ప్రాంతానికీ మధ్య విద్యావిషయంలో ఉన్న భేదాలను తొలగించటం, ఏ స్థాయిలో విద్యాభ్యాసం చాలించేవారికైనా తగు శిక్షణా సౌకర్యాలు ఉద్యోగ లబ్ధికి అవకాశాలు ఉండేటట్టు చేయటం గూడా యీ ప్రణాళికా కాలంలో సాధించాలి.



పసిపాపల కోసం ఏర్పడ్డ పాఠశాలల అభివృద్ధికై ప్రణాళికలో 5 లక్షల రూపాయలున్నవి. 200 మంది క్రొత్త ఉపాధ్యాయులు నియమింపబడతారు.



ప్రాథమిక విద్యాస్థాయిలో, 6-11 ఏండ్ల వయస్సుగలవారికి నిర్బంధ విద్యావకాశం కల్పించడానికి క్రొత్తగా 52,025 ఉపాధ్యాయులను నియమించవలసి ఉంది. క్రొత్తగా బళ్ళోచేరే పిల్లలు 20,81,000 ఉంటారు. ప్రాతిపదిక విద్యకై ఏర్పడ్డ పాఠశాలలకు ఇతోధిక సహాయం లభిస్తుంది. 40 సామాన్య పాఠశాలలను ప్రాతిపదిక పాఠశాలలుగా మార్చవలసి ఉంది. నగర ప్రాంతాలలో ఉన్న 29 పాఠశాలలు మాడల్ బేసిక్ పాఠశాలలుగా మార్చబడతవి. సామాన్య ప్రాథమిక పాఠశాలల

ఉపాధ్యాయులు 68,000 మందికి బేసిక్ విద్యాబోధనలకు అవసరమైన శిక్షణ యియ్యబడుతుంది. నూలువడకటం, కూరగాయలు పెంచటం నేర్పటానికి వీలుగా 29,000 ప్రాథమిక పాఠశాలలకు ఒక్కొక్క దానికి రు. 75 ల చొప్పున ఖర్చుతో సామగ్రి సప్లయి చేయబడుతుంది.

11-14 ఏండ్ల వయస్సుగల పిల్లలు అదనంగా 2,58,000 మంది బళ్ళల్లో చేరుతారు. వీరికి చదువు చెప్పే ఉపాధ్యాయులు క్రొత్తగా, 6,700 మంది నియమింప బడతారు. తొమ్మిదవ, పదవ తరగతులలో చేరే పిల్లలు అదనంగా 50,000 ఉంటారు. 400 హైస్కూళ్ళను హైయర్ సెకండరీ స్థాయికి తీసుకురావలసి ఉంది. పూర్తిగా కేంద్ర ప్రభుత్వ సహాయంతో 5 క్రొత్త బహుళార్థ సాధక పాఠశాలలు స్థాపింప బడతవి.

ఇప్పుడు రాష్ట్రంలో ఉన్న తొమ్మిది ట్రెయినింగ్ కళాశాలలలో, నాలుగు ప్రభుత్వ కళాశాలలలో ఇంకా 150 మందికి శిక్షణావకాశాలేర్పడతవి.

ఒక క్రొత్త విశ్వ విద్యాలయం 1965-66 లో ఏర్పడుతుంది. ఇప్పుడున్న మూడు విశ్వ విద్యాలయాలకు ఇతోధిక ధనసహాయం లభిస్తుంది. సైన్సు గ్రాడ్యు యేట్ల సంఖ్య ఏటేటా ఇప్పుడున్నవారికంటె 6,000 ఎక్కువ చేయవలసి ఉంది. సాంఘిక విద్య, శ్రవ్య - దృశ్య విద్యా సౌకర్యాలు గూడా అభివృద్ధి చేయబడతవి. వీటికై ప్రణాళికలో రు. 13 లక్షలు కేటాయించబడ్డది. జాతీయ విద్యార్థి దళం, సహాయ విద్యార్థిదళాల అభివృద్ధికోసం రు. 17 లక్షలు ఖర్చవుతవి.

శ్రీకాకుళంలో క్రొత్తగా ఒక పాలిటెక్నిక్ స్థాపించబడుతుంది. బాలికలకోసం ప్రత్యేకంగా రెండు సాంకేతిక విద్యాసంస్థలు నెలకొల్పబడుతవి. గృహశాస్త్ర కళాశాలలో డిగ్రీస్థాయి వరకు శిక్షణయిచ్చే ఏర్పాటు చేయబడుతుంది. లలిత కళాశాల, సంగీత పాఠశాలలు కళాశాలలను గూడా వృద్ధిచేయాలి. మొత్తం మీద సాంకేతిక విద్యాభివృద్ధికి రు. 303.25 లక్షలు కేటాయించబడ్డవి. ఇవిగాక, పురాతత్వ శాస్త్రం, ప్రదర్శన శాలలకోసం రు. 1,75,000 ఖర్చవుతవి.





క్రొత్తగా హైదరాబాదులో నడుస్తున్న రెండంతస్థుల బస్సు

# రోడ్డు రవాణా సౌకర్యాలు

నేటి ప్రణాళికా యుగంలో రహదారులకు ప్రజాజీవితంతో అత్యంత సన్నిహిత సంబంధం ఉంది. రవాణా సౌకర్యాలు అభివృద్ధి జరిగినకొలది ప్రజాజీవితం బహుముఖంగా పరిమళించడానికి అవకాశం కలుగుతుంది. దేశంలో అన్ని ప్రాంతాలకు అందుబాటులో ఉండేటట్లు, రాకపోకల సౌకర్యాలు పుష్కలంగా లభించేటట్లు రోడ్ల నిర్మాణ పథకాలను త్వరితంగా అమలుజరపడమే ప్రభుత్వ విధానం. దేశంలో అసంఖ్యాకంగా రైళ్లు, విమానాలు నడుస్తున్నటికీ రోడ్డురవాణా ఆవశ్యకత పెరుగుతూనే ఉంది.

20 సంవత్సరాల కాలంలో వ్యవసాయికంగా అభివృద్ధిపొందిన ప్రతిప్రాంతానికీ రోడ్ల సౌకర్యం ఉండే ఏర్పాటు చేసుకోవాలనీ రోడ్డుకు అయిదు మైళ్ళకంటె ఎక్కువ దూరంగా గ్రామప్రాంతాలు ఉండకూడదనీ, 1943 లోనే నాగపూర్ ప్రణాళికలో నిర్దేశించబడింది. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు తలపెట్టే రోడ్ల నిర్మాణ

పథకాలు యావద్భారత దృష్టితో రూపొందించుకోవాలనీ, అన్ని తరహాలకు చెందిన రోడ్లఅభివృద్ధికి సమన్వయంతో కృషి జరగాలనీ, రాకపోకల సౌకర్యాలకు అనుగుణంగా నిర్ణీతపథక క్రమంలో అభివృద్ధి సాధించాలనీ నాగపూర్ ప్రణాళిక పేర్కొన్నది. రోడ్ల ఉపయోగాన్నిబట్టి జాతీయ రహదార్లు, రాష్ట్ర రహదార్లు, పెద్ద రోడ్లు, జిల్లా రోడ్లు, గ్రామ రోడ్లు అనే విభాగంకూడా జరిగింది. జాతీయ రహదార్లు ముఖ్యంగా జాతీయ ప్రయోజనాలకు, అంటే దేశరక్షణకు సైనిక దళాల తరలింపుకు ఉపయోగపడుతూ, వివిధ రాష్ట్ర రాజధానులను, దేశంలోని రేవు పట్టణాలనూ, విదేశ రహదార్లనూ కలుపుతూ దేశం ఒక చివరనుండి మరొక చివరకు నేరుగా ఏర్పాటు చేయబడిన రోడ్లు. వీటి అభివృద్ధి నిర్వహణకు అయ్యే ఖర్చు అంతా కేంద్ర ప్రభుత్వమే భరిస్తుంది.

మొదటి రెండు ప్రణాళికల్లో పూనుకొన్న కార్యక్రమాల ఫలితంగా నాగపూర్ ప్రణాళిక లక్ష్యాలను కంకర, మామూలు రోడ్ల విషయంలో పెంచటం జరిగింది. (నాగపూర్ ప్రణాళిక లక్ష్యం 1,23,000 మైళ్ల కంకర రోడ్లను, 2,08,000 మైళ్ళ మామూలు రోడ్లను పూర్తిచేయటం.) ఇవాళ దేశంలోని సర్ఫేస్ రోడ్లపొడవు 1,44,000 మైళ్ళు ఉంది. అన్సర్ఫేస్డ్‌రోడ్ల పొడవు 2,50,000 మైళ్ళకు పైన ఉంది. రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాల ప్రధాన ఇంజనీర్లు ఇటీవల 1961—81 వ్యవధికి మరొక 20 ఏళ్ళరోడ్ల అభివృద్ధి ప్రణాళికను రూపొందించారు. ఈ ప్రణాళికకు స్థూలంగా లక్ష్యం - అభివృద్ధిచెందిన వ్యవసాయ ప్రాంతంలో ఏ గ్రామంకూడా కంకర రోడ్డుకు నాలుగు మైళ్ళకన్న ఎక్కువ దూరంలో ఉండకూడదు. ఏదో ఒకరకం రోడ్డుకు ఒకటిన్నర మైళ్ళకన్న ఎక్కువ దూరంలో ఉండకూడదు. అభివృద్ధి చెందనట్టి, తక్కువగా అభివృద్ధిచెందినట్టి ప్రాంతాల్లో ప్రత్యేకఅవసరాలను ప్రణాళిక లెక్కలోకి తీసుకున్నది. ప్రణాళిక క్రింద 20 సంవత్సరాల అంతం నాటికి సాధించవలసిన లక్ష్యం - సర్ఫేస్ రోడ్లు 2,52,000 మైళ్ళు, అన్సర్ఫేస్డ్ రోడ్లు 4,05,000 మైళ్ళు.

20 ఏళ్ళ ప్రణాళికలో స్థూలంగా ఉద్దేశించిన ప్రాధాన్యక్రమం, (అ) అనుబంధ మార్గాలలో, లేనిచోట వంతెనలు వేయటం, రోడ్ల పైభాగాన్ని ఒకదారి భాగానికైనా తారుచేయటం, (ఆ) పెద్ద నగరాల సమీపంలోని పెద్ద రోడ్లను ఇంకెక్కువగా వెడల్పు చేయటం, (ఇ) పెద్ద అనుబంధ మార్గాలకు కనీసం రెండుదార్ల బండి మార్గ ఉండాలి. ప్రణాళిక ప్రకారం గ్రామీణ రోడ్ల విషయంలో మొదటగా చేయవలసిన కృషి వాటిని సాఫీ రోడ్ల ప్రమాణానికి అనుగుణంగా అభివృద్ధి

చేయటం. గడచిన పదేళ్ళలో జిల్లా రోడ్లకు గ్రామరోడ్లకు గిరాకీ హెచ్చింది. ఈ రోడ్ల అభివృద్ధివలన గ్రామప్రాంతాల్లోని లక్షలాది ప్రజలకు ప్రయోజనం కలుగుతుంది.

మొదటి ప్రణాళికలో రోడ్ల అభివృద్ధి ఖర్చు రూ. 155 కోట్లు ఉన్నది. రెండవ ప్రణాళికలో సుమారు రూ. 224 కోట్లు ఖర్చు జరిగింది.

రెండవ ప్రణాళికలో రోడ్ల అభివృద్ధి కార్యక్రమాలను రూపొందించటంలో రవాణా సౌకర్యాల విషయంలో కొంత వెనుకబడిన ప్రాంతాల అవసరాలకు ప్రత్యేక ప్రాముఖ్యం చూపబడింది. అస్సాం, త్రిపుర, మణిపూర్, హిమాచల ప్రదేశ్, జమ్ము, కాశ్మీర్, రాజస్థాన్‌వంటి రాష్ట్రాల్లో మామూలుగా మొత్తం ప్రణాళిక కేటాయింపులో కొంచెం ఎక్కువ శాతం రోడ్లకు కేటాయించబడింది. ఉత్తర పర్వత ప్రాంతాల్లోనూ, ఈశాన్య పర్వత ప్రాంతాల్లోనూ రోడ్ల అభివృద్ధికి కేటాయింపు చేయబడింది. ఈ కార్యక్రమాలకు కేంద్రప్రభుత్వం నుంచి గ్రాంట్ల సహాయం లభించింది. రెండవ ప్రణాళికలో సమాజ వికాస కార్యక్రమాల క్రింద స్థానిక అభివృద్ధి కార్యక్రమాల క్రింద జిల్లాబోర్డుల, పురపాలక సంఘాల కార్య క్రమాల క్రింద కొంత స్థానికరోడ్ల అభివృద్ధి జరిగింది. మొదటి రెండు ప్రణాళికల కాలంలో మ్యునిసిపల్ రోడ్లు మినహా మిగత సర్ఫేస్డ్ రోడ్లన్నిటి పొడవు సుమారు 50 శాతం పెరిగింది – అంటే 1950 - 51 లోని సుమారు 98,00 మైళ్ళనుంచి 1960 - 61 లో సుమారు 144,000 మైళ్ళు.

మూడవ ప్రణాళికలోని రోడ్ల అభివృద్ధి కార్యక్రమాలకు రు 324 కోట్లు కేటాయించబడినవి. రాష్ట్రరంగంలో కార్యక్రమాలకు - రు 244 కోట్లు; కేంద్రరంగంలో- రు 80 కోట్లు - స్థానిక రోడ్ల అభివృద్ధి కార్యక్రమాల క్రింద చేర్చే రోడ్ల మైళ్ళు ఇందుకు అదనంగా ఉంటాయి.

మూడవ ప్రణాళికా కాలంలో జాతీయ రోడ్డురవాణా విస్తరణ జరిగినప్పటికి ప్రయివేటురంగం ఇంకా చాలారవకు ప్రయాణీకుల సౌకర్యాలను సమకూర్చవలసి ఉంటుంది. ఇక సరకుల రవాణా ఇంచుమించు పూర్తిగా ప్రయివేటు రవాణాదారుల చేతుల్లోనే ఉంది. రోడ్డురవాణాకిచ్చే లైసెన్సుల విషయంలో ఇటీవల ధారాళంగా ఉండటానికి తగుచర్యలు తీసుకొనబడినాయి. అయినా విదేశ ద్రవ్యమారకం విషయంలో ఇబ్బందివల్ల తగినన్ని క్రొత్తశకటాలు లభించక పోవటంవల్ల రెండవ

ప్రణాళికా కాలంలో రోడ్డురవాణా త్వరిత విస్తరణకు ఆటంకం కలిగింది. అయినా 1950-51, 1960-61 మధ్య పదేళ్ళకాలంలో దేశంలోని వ్యాపార శకటాల సంఖ్య ఇంచుమించు రెట్టింపు పెరిగినట్లు అంచనా వేయబడింది.

ఇక ఆంధ్రప్రదేశ్‌లోని రోడ్ల అభివృద్ధి కార్యక్రమాన్ని పరిశీలిద్దాం. ప్రథమ ప్రణాళిక ప్రారంభంలో మనరాష్ట్రంలో 18,599 మైళ్ళ రోడ్లు ఉండేవి. ప్రణాళిక కాలంలో ఆంధ్రప్రాంతంలో 109½ మైళ్ళలో కంకరోడ్లు వేశారు. పెద్దవి 7, చిన్నవి 20 వంతెనలు, 10 తూముల నిర్మాణం కూడా జరిగింది. ఇదంతా రాష్ట్ర రహదార్ల అభివృద్ధి కార్యక్రమం. పోతే ఇతరరోడ్లు అనే అంశం క్రింద 679 మైళ్ళ క్రొత్త రోడ్లు వేయటం, 320 మైళ్ళలో కంకరవేయటం జరిగింది. ఇవి జిల్లాబోర్డుల క్రింద ఉండేరోడ్లు. చిన్నరకం వంతెనల నిర్మాణానికి రు 14 లక్షలు. ఇతర చిన్న అభివృద్ధి పనులకు రు. 3 లక్షలు ఖర్చు జరిగింది. రోడ్ల వంతెనల నిర్మాణానికి అవసరమైన రు. 40.69 లక్షల విలువగల యంత్రసామగ్రి సేకరణ జరిగింది. తూర్పు పశ్చిమ గోదావరిజిల్లాలలో 5 వ నెంబరు జాతీయ రహదారి అభివృద్ధికై గౌతమి, వసిష్ట నదులమీద వంతెనల నిర్మాణానికి విరాళంగా రాష్ట్ర ప్రభుత్వం యిచ్చిన మొత్తం 5.50 లక్షలు. ప్రథమ ప్రణాళికాంతానికి ఆంధ్ర ప్రాంతంలో 15, 467 మైళ్ళ రోడ్లు ఉన్నాయి. ఇందులో 937 మైళ్ళు జాతీయ రహదార్లు, 5,737 మైళ్ళు రాష్ట్రప్రభుత్వ రోడ్లు, 8,793 స్థానిక సంస్థలరోడ్లు. రాష్ట్ర ప్రభుత్వపు రోడ్లలో 1,365 మైళ్ళ రాష్ట్ర రహదార్లు, 4,358 మైళ్ళు పెద్దరకం జిల్లారోడ్లు.

ద్వితీయ ప్రణాళికలో రు 593 లక్షలు రోడ్ల అభివృద్ధికి రోడ్డురవాణాకు కేటాయింప బడినవి. మొదటి నాలుగేండ్ల కాలంలో 250 మైళ్ళలో క్రొత్త రోడ్ల నిర్మాణం 213 మైళ్ళలో సిమెంటు కాంక్రీటు 365.5 మైళ్ళలో దుమ్మునివారణ కార్యక్రమం జరిగింది. ఇవిగాక 978 మైళ్ళ జిల్లాబోరుల రోడ్డులను ప్రభుత్వం స్వాధీన పరచుకొని వ్యవసాయోత్పత్తుల అభివృద్ధి దృష్ట్యా ప్రాధాన్యక్రమం అనుసరించి అభివృద్ధి పరచటం జరిగింది.

ప్రభుత్వపురోడ్ల నిర్వహణకు 1960-61 సంవత్సరానికి ప్రభుత్వం రు. 205 లక్షల గ్రాంటు మంజూరు చేసింది.

పోతే ప్రజల ప్రయాణ సౌకర్యాలకు సంబంధించిన రోడ్డు రవాణా సర్వీసుల విషయంలో 1932 జూన్‌నుండి హైదరాబాదులో జాతీయమైన యీ సౌకర్యం

ఉంటూ ఉంది. ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరం జాతీయమైన రోడ్డు రవాణా సర్వీసును ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రోడ్డు రవాణా కార్పొరేషన్‌పరంచేయటం జరిగింది. ఈ సంస్థ 1958 జనవరి నుంచి పనిచేస్తున్నది. ఈ సంస్థ మేనేజింగ్ కమిటీ అధ్యక్షుడు రాష్ట్రప్రభుత్వ ముఖ్యకార్యదర్శి. రోడ్డురవాణా కార్పొరేషన్ అధ్వర్యాన బస్సులు ఇప్పుడు కృష్ణా, పశ్చిమగోదావరి జిల్లాలలో నడుస్తున్నవి. గుంటూరుకు కూడా యీ సౌకర్యం విస్తరించబడింది.

రాష్ట్రమూడవ ప్రణాళికలో రోడ్ల అభివృద్ధికి రోడ్డురవాణా సౌకర్యాలు విస్తరించటానికి రు. 11,50 లక్షలు కేటాయింప బడినవి. ఇందులో రు. 870 లక్షలు ఆంధ్రలోను, రు. 280 లక్షలు తెలంగాణాలోను ఖర్చుపెట్టబడతవి. 1961-62 లో ఇందునిమిత్తం రు. 199.80 లక్షలు కేటాయింపబడినవి.

ఆధునిక నాగరికతలో పెనవైచుకొని పోయివున్న రోడ్ల అభివృద్ధి వచ్చే సంవత్సరాలలో ఇంకా విస్తృతంగా జరుగుతుంది. అయితే ప్రభుత్వపరంగా జరుగుతున్న కృషికాక ప్రజలుకూడా చేయవలసిన పని ఎంతో ఉన్నది. ఇది కొంతవరకు ఇప్పుడు జరుగుతూనే వుంది కాని, ఇంకా భారీఎత్తున జరగాలి. అది శ్రమదానంతో గ్రామ రహదార్లను బాగుచేసుకొనడం, క్రొత్తవి నిర్మించుకోవడం. ఉత్సాహంతో ప్రజలే యీ పనికి పూనుకుంటే వర్షాకాలంలో రవాణా సౌకర్యాలకు అవరోధం కలుగదు. మంచి రోడ్లు ఏర్పడి జీవితం సుఖవంతమవుతుంది.





## అరణ్యాలు - భూసారరక్షణ

ఈనాడు మన దేశంలో అరణ్య ప్రదేశం పెంపొందవలసినంతగా పెంపొందక పోయినా, అరణ్యాల నుండి వచ్చే వస్తువుల అవసరం మాత్రం పెరిగి పోతున్నది. ఇచ్చటి శీతోష్ణస్థితిని బట్టి, వర్షాలను బట్టి ఎక్కువగా వ్యవసాయం మీదే ఆధారపడిన ఆర్థిక స్థితినిబట్టి, అడవులలో ఉత్పత్తి అంతగా లేక పోవడం వల్ల, భారత దేశంలో మూడోవంతు భూభాగమైన అటవీ ప్రదేశంగా వుండాలని నిపుణుల నిర్ణయం. అంతవరకూ పోవాలంటే యింకా చాలాదూరం ప్రయాణించాలి. ఇప్పుడు 21.8 శాతం మాత్రమే అడవులున్నవి. అవీ నాలుగైదు

రాష్ట్రాల్లో మాత్రమే ఉన్నవి కాని, దేశమంతా సమానంగా వ్యాపించిలేవు. కాబట్టి అడవు లిప్పటి కంటె విరివిగా పెరుగేటట్టు చేయటమే కాక అన్ని ప్రాంతాల్లోనూ వ్యాపించేటట్టు చూడటం గూడా ముఖ్యం.

పరిశ్రమలకు కావలసిన కొయ్య, ఇంటిపనులకు కావలసిన కట్టెలు మొదలయినవి మన అడవులనుండి యిప్పుడే చాలినన్ని లభించటంలేదు. వంట కట్టెలు చాలినన్ని లేకపోవటం వల్లనే సుమారు 40 కోట్ల టన్నుల గోమయం యిందుకు బదులుగా దేశంలో వాడబడుతున్నది. లేక పోతే యిన్ని టన్నుల విలువైన ఎఱువు పదార్థం భూమిలో ఉపయోగించి పంటలు వృద్ధిచేసుకోవచ్చు. అడవులలోనుంచి వచ్చే యితర పదార్థాలు కూడా దేశంలో అవసరాలకు సరిపోవటం లేదు. అభివృద్ధి కార్యక్రమాలు సాగిపోతూ పరిశ్రమలు పెరిగిన కొద్దీ, విద్య వ్యాపించిన కొద్దీ యీ వస్తువులింకా యెక్కువగా కావలసివస్తవి. అడవుల పెంపకం మాత్రం అంత సత్వరంగా జరగదు. క్రొత్తగా వేసినచెట్లు కొన్ని 25,30 యేండ్లదాకా ఫలితాలివ్వవు. కాబట్టి ప్రణాళికా కార్యక్రమానికి ముఖ్యోద్దేశం తొందరగా ఫలించే చెట్ల రకాలు నాటి, అడవులలో నుండి వచ్చే పదార్థాల ఉత్పత్తి వృద్ధి పొందేటట్టు చూడటం.

మూడవ ప్రణాళికలో దేశమంతటా యీ అటవీ సంపదను పెంపొందించే కార్యక్రమానికి రు. 51 కోటు కేటాయించబడ్డవి. అన్నిటికంటె ముఖ్యమైనది క్రొత్త అడవులను పెంచటం. సామాన్యంగా వాడుకలో నున్న కొయ్య రకాలే కాకుండా, తొందరగా పెరిగి ఉపయోగించే వృక్షజాతులు గూడా విరివిగా నాటబడతవి. క్రొత్తగా 2,10,000 ఎకరాల భూమిలో టేకుచెట్లు, 40,000 ఎకరాలలో వెదురు, 46,000 ఎకరాలలో వంట కట్టెలకు ఉపయోగించే చెట్లు, అగ్గిపుల్లల తయారీకి పనికి వచ్చే వృక్షాలు 60,000 ఎకరాల్లో, ఇంకా 347,000 ఎకరాల్లో ఇతర రకాలు పెంచవలెను. ఇవి గాక, వివిధ పరిశ్రమలలో ఉపకరించే కలప రకాలు 300,000 ఎకరాల్లో పెంచవలసివుంది.

పంచాయతీ సమితులు, పంచాయతీలు, కర్షకులు రకరకాల వృక్షాలను నాటే కార్యక్రమం విరివిగా చేపట్టవలసివుంది. ప్రత్యేకంగా వ్యవసాయదారులు పెంచి

పోషించవలసిన వృక్షాలు మూడవ ప్రణాళికా కాలంలో దేశమంతటా 12 లక్షల యెకరాలలో నాటవలసివున్నది. అటవీ శాఖల వారు కావలసిన బీజాలు, మొక్కలు లభించేటట్టు చేస్తారు. కలప మొదలైనవి వృథాకాకుండా ఉపయోగించుకోటానికి క్రొత్తగా తయారవుతున్న పనిముట్ల ఉపయోగంలో చాలా రాష్ట్రాల అటవీ శాఖో ద్యోగులు శిక్షణ పొందారు. ఇంకా అలాంటి పనిముట్లను గూర్చి డేరాడూన్ లోని అటవీ పరిశోధనా కేంద్రంలో ప్రయోగాలు జరుగుతున్నవి.

అడవుల నుండి సత్వరంగా కలప రవాణా కావటానికి రోడ్లఅభివృద్ధి అవ సరం. మూడవ ప్రణాళికలో అటవీ ప్రాంతాల్లో రోడ్లు 15,000 మైళ్ల వరకు బాగు చేయబడతవి.

అడవుల నుండి కలపే కాక అనేక రకాల యితర పదార్థాలు-లక్క, పేము, తేనె, మందులు మొదలైనవి - 3,000 వరకు లభించటానికి అవకాశాలున్నవి. ఇందులో కొన్ని యితర దేశాలకు ఎగుమతి చేయవచ్చు. రాష్ట్ర ప్రణాళికలో వీటి అభివృద్ధికి కేటాయింపు లున్నవి.

పశువుల మేతకు గూడా అడవుల్లో కొన్ని భాగాలు ప్రత్యేకంగా ఏర్పరచుకో వచ్చు. ఇందుకు పనికి వచ్చే మొక్కలను గడ్డిని 150,000 ఎకరాల భూమిలో పెంచ వలెనని మూడవ ప్రణాళికలో ఉద్దేశించబడ్డది.

డేరాడూన్‌లో జరుగుతున్న పరిశోధనలే కాక, వాటికి సహాయంగా పనిజరగ టానికి మూడు ప్రాంతీయ పరిశోధనా కేంద్రాలు గూడా తెరవబడతవి. రాష్ట్రాల అటవీ శాఖలకు 480 ఆఫీసర్లు, 1520 రేంజెర్లు తర్ఫీదు పొందవలసివున్నది. ఇందు కని డేరాడూన్‌లోని అటవీ కళాశాలలో చేర్చుకొనే ఆఫీసర్ల సంఖ్య 85 నుండి 100కి, డేరాడూన్‌లోను, కోయంబత్తూరులోను వున్న రేంజర్ల కాలేజీలలో చేర్చుకొనే వారి సంఖ్య 200 నుండి 300 కి హెచ్చింపబడుతుంది. అడవులు సక్రమంగా పెరగ టానికి మృగ, పక్షి జాతులు గూడా సహాయ పడతవి. వీటిని వృద్ధి పరచటానికి దేశంలో యింకా 5 జంతు ప్రదర్శనశాలలు, 5 జాతీయ ప్రదర్శన శాలలు, 10 వన్య మృగ రక్షణ కేంద్రాలు క్రొత్తగా యేర్పాటు చేస్తారు.

భూసారం క్షీణించిపోకుండా కాపాడటానికి కూడ అడవుల పెంపకం చాలా అవసరం. ముఖ్యంగా పెద్దపెద్ద నదులు జలం సేకరించే ప్రాంతాల్లో అడవులు

బాగా పెరిగితే, ఆ నదులమీద కడుతున్న ప్రాజెక్టు వద్ద రిజర్వాయర్లు చిరకాలం నిలవటానికి తోడ్పడుతవి. ఇదేగాక, వరదలను నిరోధించటంలోను, నేల కోతను అరికట్టడంలోను, భూమిని సారవంతంగా చేయటంలోనూ, చెరువులు పూడిపోకుండా వుండటానికి తోడ్పడటమే కాక, అలాంటి అడవులనుండి కలప, కట్టెలు కూడా ఎక్కువగా దొరకవచ్చు. చెట్లను మితిమీరి కొట్టివేయటంవల్ల, ఇష్టం వచ్చినట్లు పశువులను మేతకు వదలివేయటం వల్ల, భూమి విషయమై సరియైన జాగ్రత్త తీసుకోకపోవటం వల్ల, యెడార్లు వ్యాపించటం తటస్థిస్తుంది. ఇలాంటి ప్రాంతాలను మళ్ళీ సస్యశ్యామలం చేయటం పూర్తిగా అసంభవం కాదు. వాటిలో చెట్లు చామ నాటి, పచ్చిక బయళ్లుగా మార్చి ఉపయోగకరంగా చేసేందుకు పరిశోధనలు జరుగుతున్నవి. మూడవ ప్రణాళికా కాలంలో లక్ష యెకరాల వరకు యెడారి ప్రాంతాలను ఉపయోగకరం చేయటానికి ప్రయత్నం జరుగుతుంది.

అడవులు పెంచటమే కాక, 'కాంటూర్ బండింగ్' మొదలైన భూసార రక్షణ మార్గాలవల్ల పంటలను వృద్ధిచేసే పథకాల మీద మూడవ ప్రణాళికా కాలంలో దేశమంతటా 72 కోట్ల రూపాయలు వెచ్చింపబడతవి.

ఆంధ్రప్రదేశ్ మూడవ ప్రణాళికలో అడవుల అభివృద్ధి కోసం రు 145 లక్షలు ఖర్చు చేయదలచుకున్నాం. ఇందులో 1961-62 సంవత్సరానికి కేటాయింపు రూ 26.22 లక్షలు.

మన రాష్ట్రంలోని అటవీ ప్రాంతంలో ఇంచుమించు మూడోవంతు టేకు మొదలైన పెద్ద వృక్షజాతులకు పనికి వస్తుంది. ఇలాంటి అడవులు కర్నూలు జిల్లాలోని నల్లమల కొండలలోను, భద్రాచలం, రంప, గూడెం ఏజెన్సీలలోను ఉన్నవి. గోదావరిలోయలోను, కృష్ణానదీ ప్రాంతాల్లో ఉన్న తెలంగాణా అడవులు జీర్ణావస్థలో వుండటం వల్ల వీటిలో విరివిగా వృక్షాలు నాటి అభివృద్ధి చేయవలసి వుంది. ఈ అయిదేండ్లలో టేకు చెట్లు 11,500 ఎకరాలలోను, యూకలిప్టస్, సర్వీ మొదలైన యితర జాతులు మరి 19,760 ఎకరాలలోను నాటవలసివున్నది. రాష్ట్రంలోని అటవీ సంపదనంతా సర్వేచేసి సరియైన సమాచారం సేకరించడానికి రు 3.30 లక్షలు ఖర్చయ్యే ఒక పథకం తయారైంది. హైదరాబాదులో నిర్మాణమవుతున్న జంతు ప్రదర్శనశాల కాక, వేరే వన్యమృగ సంరక్షణ కేంద్రాలు నెలకొల్పడానికి రూ. 3.96 లక్షలు కేటాయించబడినవి. కలపను బాగు చేయటానికి, నిలవ

చేయటానికి అవసరమైన యంత్ర సామగ్రిని సేకరించటానికి కావలసిన పనివారి శిక్షణకు తగిన కేటాయింపులున్నవి. పరిశోధనా కార్యక్రమానికి రూ. 1.50 లక్షలు ఖర్చవుతుంది. అటవీ ప్రాంతాలలో 192 మైళ్ళ వరకు రోడ్లు నిర్మింప వలసివున్నది. అక్కడ పనిచేసే ఉద్యోగులకు, కార్మికులకు వలసిన సౌకర్యాలేర్పరచటానికి ఒక లక్షరూపాయలు కేటాయించారు.

మన రాష్ట్రంలో సుమారు 120 లక్షల యెకరాల వరకు నేలకోత వల్ల నిస్సారమవుతున్నట్లు అంచనా. గడచిన పదేండ్లలో కొంతవరకు దీన్ని అరికట్టే కార్యక్రమం సాగింది. మూడవ ప్రణాళికలో రు 163 లక్షల ఖర్చుతో యింకా విరివిగా భూసార రక్షణ పథకాలు నడుప వలసివుంది. పరిశోధనా పథకాలు రెంటికై రు 2.70 లక్షలు కేటాయించబడ్డవి. మాచ్‌ఖండ్ ప్రాంతంలో జాలాపుట్ రిజర్వాయరు రక్షణ కోసం, ఆదివాసుల వ్యవసాయ పద్ధతులు వారి ఆర్థికస్థితి బాగు పరిచేందుకు ప్రారంభించిన కార్యక్రమం మూడవ ప్రణాళికలోగూడా నడుస్తుంది. శ్రీకాకుళం, విశాఖపట్నం, అనంతపురం, చిత్తూరు, కడప జిల్లాలలోనే గాక నాగార్జునసాగర్ ప్రాంతంలో గూడా యీ పథకాలు నిర్వహించవలసివుంది. మన రాష్ట్రంలో ప్రణాళికా విజయం ముఖ్యంగా వ్యవసాయోత్పత్తి వృద్ధికావటం మీదనే ఆధారపడివుంటుంది. భూసార రక్షణవల్ల యింకా యెక్కువ భూమిని సాగులోకి తీసుకురావటానికి వీలుంది. అందుచేత ఈ కార్యక్రమానికి ప్రణాళికలో ముఖ్యస్థానం వుంది. ఈ యేడు దీనికై మన రాష్ట్రంలో రు. 28.24 లక్షలు ఖర్చు కాగలవు. మొత్తం ప్రణాళికా కాలానికి కేటాయింపు రు 163 లక్షలు.





హైదరాబాదులో క్రొత్తగా నిర్మిస్తున్న కాలనీ

# గృహ సౌకర్యాలు

రామాయణం అంతా మూడు పదాల్లో చెప్పినట్టే, ఆధునిక ప్రభుత్వాల ముఖ్యాశయం ప్రజలందరికీ "తిండి, ఇల్లు, బట్ట" (సమకూర్చడం) అని ముక్తసరిగా చెప్పవచ్చును. ఈ వ్యాసంలో గృహవసతి సౌకర్యాల విషయమై ప్రస్తావిస్తాను.

దేశంలో, ముఖ్యంగా నగర ప్రాంతాలందు గృహవసతి కొరత ఎక్కువగా ఉంది. రెండో ప్రపంచ యుద్ధం, దేశ విభజనవలన గృహవసతి పరిస్థితి మరీ విషమించింది. ఈ కొరతను తగ్గించడానికి మొదటి పంచవర్ష ప్రణాళికా కాలములో కొంత కృషి జరిగింది. మొదటి ప్రణాళికలో నగర ప్రాంతాలందు దాదాపు 13 లక్షల గృహాలైనా నిర్మించబడి యుంటాయని అంచనా వేయబడింది. రిజర్వు బ్యాంకు ఉజ్జాయింపు అంచనాబట్టి, మొదటి ప్రణాళికా కాలంలో బస్తీల్లో గృహ నిర్మాణం క్రింద పెట్టుబడి సుమారు రూ. 500 కోట్లు ఉంది.

రెండో ప్రణాళికలో ప్రభుత్వం వ్యయం చేయవలసిన గృహవసతి కేటాయింపులు ఎనిమిది నిర్దిష్ట కార్యక్రమాలకు సంబంధించినట్టివి. - 1. ప్రభుత్వం సహాయంచేసే పారిశ్రామిక గృహవసతి రూ. 24.2 కోట్లు; 2. తక్కువ ఆదాయ వర్గాల గృహవసతి రూ. 37.8 కోట్లు; 3. యూనియన్ ప్రాంతాల్లో మధ్యతరగతి వారి గృహ వసతి రూ. 0.3 కోట్లు; 4. మురికి పేటల నిర్మూలన రూ. 9.9 కోట్లు; 5. గ్రామీణ గృహవసతి రూ. 3.7 కోట్లు; 6. వ్యాపారపు పంటల తోటలలో పనిచేసే కార్మికుల గృహవసతి రూ. 0.1 కోట్లు; 7. ప్రభుత్వ గృహ పథకాలు రూ. 2 కోట్లు; 8. భూమి సేకరణ, అభివృద్ధి రూ. 1.1 కోట్లు.

పైన పేర్కొన్న గృహనిర్మాణ పథకాలు కాక, సంఘంలో కొన్ని ప్రత్యేక వర్గాల కోసం కూడా ఇళ్ళు నిర్మింపబడ్డవి. షెడ్యూల్డు కులాలు, జాతులకు, వెనుకబడిన తరగతులకు, చేనేత పారిశ్రామికులకు, కాందిశీకులకు నిర్మించిన గృహాలు యీ తరగతి క్రింద వస్తవి. బొగ్గు, మైకా పరిశ్రమల్లో ఉన్న కార్మికుల కోసం, కార్మిక సంక్షేమ నిధుల తోడ్పాటుతో ఇళ్ళు నిర్మించబడినవి. రెండో ప్రణాళికా కాలంలోనే మధ్యతరగతి వారికి గృహ నిర్మాణానికి జీవిత భీమాసంస్థ ధనసహాయం చేయ నారంభించింది. తక్కువ ఆదాయం వారికి అద్దె పుచ్చుకొని ఇళ్ళు ఇవ్వడానికి రాష్ట్రప్రభుత్వాలకు భీమాసంస్థ తోడ్పడింది. ఇదిగాక కేంద్ర ప్రభుత్వం, ప్రయివేటు రంగం తమ సిబ్బందికోసం చాలాగృహాలు నిర్మించడం జరిగింది. రెండో ప్రణాళికా కాలంలో మొత్తం అయిదు లక్షల గృహాలు నిర్మింపబడినవి. వీనికోసం రూ. 250 కోట్లు వెచ్చింపబడినవి.

ప్రభుత్వం ధన సహాయంచేసే పారిశ్రామిక గృహ పథకం 1952 లో రూపొందించబడింది. ఈ పథకం క్రింద కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాలకు, చట్టబద్ధమైన గృహ నిర్మాణ బోర్డులకు, పురపాలక సంస్థలకు ఖర్చులో సగం భాగం ఋణంగానూ, సగభాగాన్ని విరాళంగానూ సమకూరుస్తుంది. పారిశ్రామిక కార్మికుల సహకార సంఘాలకు ప్రభుత్వం ఇచ్చేవిరాళం ఖర్చులో 25 శాతం ఉంటుంది. ఋణం 65 శాతం ఉంటుంది. పారిశ్రామిక యజమానుల విషయంలో ఖర్చులో 75 శాతం సమకూర్చబడింది. (ఋణంగా 50 శాతం, విరాళంగా 25 శాతం) రెండో ప్రణాళిక ముగింపునాటికి 1,00,000 ఇళ్ళు పూర్తి అయినవి. 40,000 ఇళ్ళు నిర్మాణంలో ఉన్నవి. విరాళపు పద్ధతి అద్దెకూడా కార్మికుల స్తోమతకు మించకుండా ఉంటే యీపథకం ఇంకా ఎక్కువగా పురోగమించేది. ఇందుమూలంగా కొన్ని

సందర్భాల్లో ఇళ్ళు ఖాళీగానే ఉండిపోయినాయి. పారిశ్రామిక కార్మికులకు గృహ వసతిని సమకూర్చటం పరిశ్రమల్లో సామర్థ్యాన్ని, ఉత్పత్తిని అధికం చేయటానికి అవసరం. ఈ విషయంలో పరిశ్రమల యజమానులు ఇంకా ఎక్కువ బాధ్యతను వహించవలసి ఉంటుంది.

తక్కువ ఆదాయవర్గపు గృహపథకం క్రింద రూ. 6,000 వార్షిక ఆదాయాన్ని మించనట్టి వ్యక్తులకు ఋణాలు లభిస్తవి. స్థలం ఖరీదుతోసహా గృహనిర్మాణానికి అయ్యేఖర్చులో 80 శాతానికి సహాయం పరిమితమై ఉంటుంది. ఇంటికి రూ. 8,000లు మించకుండా ఉండాలి. స్థానిక సంస్థలకు, లాభాపేక్ష లేకుండా నడపబడే ప్రజాసంస్థలకు, గుర్తింపబడిన ప్రజారోగ్య విద్యాసంస్థలకు, ధర్మసంస్థలకు, సహకార సంస్థలకు కూడా యీ సహాయం అందివ్వబడుతుంది. 1954 లో పథకం ఆరంభమైనప్పటినుంచి 85,000 ఇళ్ళకు ఋణాలు మంజూరు చేయబడినాయి. రెండవ ప్రణాళిక ముగింపు నాటికి 53,000 ఇళ్ళ నిర్మాణం పూర్తయింది. ఈ పథకం క్రింద ఋణాలకు గిరాకీ ఉంది.

మధ్యతరగతి వారి ఇళ్ల నిర్మాణానికి ఋణాలు ఇచ్చే పద్ధతి 1959 ఫిబ్రవరిలో ప్రవేశపెట్టబడింది. జీవితభీమా సంస్థ ఇందుకోసం ధనసహాయం చేస్తున్నది. ఈ సహాయం వార్షిక ఆదాయం రూ. 6,000 నుంచి 15,000 వరకు ఉన్నవారికి లభిస్తుంది. ఇదివరకే స్థలం ఉన్నవారికి రూ. 16,000 నూ, స్థలం కొనుక్కొని ఇల్లుకట్టుకునేవారికి రూ, 20,000 ఋణాలుగా ఇవ్వబడతాయి. రెండో ప్రణాళిక ముగిసే టప్పటికి 3,600 మందికి యీ పథకంక్రింద సహాయం లభించింది.

ప్రణాళిక ప్రాజెక్టుల సంఘం ఏర్పాటుచేసిన పరిశీలనా దళమూ, మురికిపేటల నిర్మూలనకుచెందిన సలహాసంఘము మూడేళ్ళకిత్రం మురికిపేటల సమస్యలను సునిశితంగా సమీక్షచేసినవి. పెద్దపెద్ద నగరాల్లో మానవ నివాసానికి ఏ మాత్రం పనికిరాని బస్తీ మురికిపేటల ఇళ్లు సుమారు 12 లక్షలు ఉన్నాయని సలహాసంఘం అంచనా వేసింది. దీర్ఘకాలిక పథకాలను అనుసరించవలసి వున్నా మురికిపేట ప్రాంతాల్లోని దుస్థితిని తగ్గించేందుకై ఉపయోగపడే స్వల్పకాలిక కార్యక్రమాలగురించి ఆలోచించటం మరింత అవసరమని యీ సంఘం సూచించింది. అంటే సరైన మరుగుదొడ్లు, మురుగు కాలువలు, కల్మషం లేని మంచినీటి సరఫరా, చేరిక రోడ్లు, చప్టా చేయబడినరోడ్లు, వీధి దీపాలు లాంటి కనీస సౌకర్యా

లను తక్షణం సమకూర్చాలన్నమాట. పై చెప్పిన సంఘాల నివేదికల ఫలితంగా తక్షణం ఇంకెక్కువ విస్తారంగా వసతులను సమకూర్చాలని అంగీకరించటం జరిగింది. మూడో ప్రణాళికలో మురికి పేటలను బాగుచేయటానికి రూ. 29 కోట్లు కేటాయించబడినవి.

గ్రామీణ గృహవసతి విషయమై రెండవ ప్రణాళికలో ప్రారంభకృషి జరిగింది. గ్రామప్రాంతాల సర్వతోముఖమైన ఆర్థికాభివృద్ధిలో ఇది ఒక భాగంగా ఎంచబడింది.

మూడో ప్రణాళికలో గృహనిర్మాణ పథకాలకు యీవిధంగా కేటాయింపులు జరిగినవి:-

| | | కోట్లు. రూ. |
|---|---|---|
| 1. | ప్రభుత్వం సహాయం చేసే పారిశ్రామిక గృహవసతి | ... 29 . 8 |
| 2. | నౌకా కార్మికుల గృహ వసతి | ... 2 . 0 |
| 3. | మురికి పేటల నిర్మూలన, అభివృద్ధి, రాత్రి ఆశ్రయ గృహాల నిర్మాణం కోసం | ... 28 . 6 |
| 4. | తక్కువ ఆదాయ వర్గాల గృహవసతి | .... 35 . 2 |
| 5. | యునియన్ ప్రాంతాల్లో మధ్యతరగతివారి గృహాల నిర్మాణానికి | ... 2 . 5 |
| 6. | గ్రామీణ గృహవసతి | ... 12 . 7 |
| 7. | డబ్బు పంటల తోటల కార్మికుల గృహవసతి | ... 0 . 7 |
| 8. | భూమి సేకరణ అభివృద్ధి | ... 9 . 5 |
| 9. | ప్రయోగ గృహనిర్మాణాలకూ, పరిశోధనకూ | ... 1 . 0 |
| 10. | రాష్ట్రాల గృహనిర్మాణ పథకాలకు | ... 2 . 3 |
| 11. | టౌను ప్లానింగు ,, | ... 5 . 4 |
| 12. | నగరాభివృద్ధి పథకాలు ,, | ... 12 . 3 |
| 13. | జీవితభీమా సంస్థ అందిచ్చే నిధులనుండి కొనసాగించే పథకాలకు | ... 60 . 0 |
| | మొత్తం | రూ. 202 . 00 |

ప్రభుత్వం ధనసహాయం చేసే పారిశ్రామిక గృహపథకం క్రింద 73,000 ఇళ్ల నిర్మాణం, తక్కువ ఆదాయ వర్గాలకు 75,000 ఇళ్ల నిర్మాణం గ్రామీణ ప్రాంతాలలో 125,000 ఇళ్ల నిర్మాణం మూడో ప్రణాళికా లక్ష్యాలు.

ఇప్పుడు మన రాష్ట్రం సంగతి చూద్దాం. మొదటి ప్రణాళికాకాలంలో ఆంధ్ర ప్రభుత్వం ఇచ్చిన ఋణాలలో 1,621 ఇళ్లు సహకార సంఘాలు నిర్మించాయి. ఈ ఇళ్లన్నీ నగరాల్లోనే నిర్మింపబడినవి. గ్రామీణ ప్రాంతంలో ప్రభుత్వ ఋణా లలో యీకాలంలో 135 ఇళ్లు నిర్మించడం జరిగింది. తక్కువ ఆదాయ వర్గాల ఇళ్ల నిర్మాణానికి పన్నెండు పురపాలక సంఘాలకూ, పధ్నాలుగు పంచాయతీలకు ఒక జిల్లా బోర్డుకూ రూ. 13.39 లక్షలు అప్పుగా ఇవ్వబడినవి. ఈ ధనంతో 499 ఇళ్లు నిర్మించబడినవి. ఇదికాక భూమి సేకరణకూ అభివృద్ధికీ మూడు పురపాలక సంఘాలకు రూ. 5.55 లక్షలు అప్పుగా ఇవ్వబడినవి. ఇదే కాలంలో తెలంగాణా ప్రాంతంలో కేంద్ర ప్రభుత్వం ఇచ్చిన ధనంతో నగర గృహనిర్మాణ పథకం క్రింద 300 రెండుగదుల ఇళ్లు నిర్మించబడినవి. ఈ ఇళ్లు రోడ్డు రవాణా శాఖకు అమ్మడం జరిగింది. ఇవి కాక 3,940 ఒంటిగది ఇళ్లకూడా నిర్మించబడినవి. వీటి నిర్మాణానికి కేంద్ర ప్రభుత్వం రూ. 49.95 లక్షలు విరాళంగానూ రూ. 49 . 99 లక్షలు ఋణంగానూ ఇచ్చింది. తక్కువ ఆదాయ వర్గాల గృహవసతి పథకం క్రింద కేంద్రప్రభుత్వం రూ. 100 లక్షలు అప్పుగా ఇచ్చింది. మొదటి ప్రణాళిక చివరకు 1,368 ఇళ్లు తెలంగాణాలో వివిధదశల నిర్మాణంలో యీ పథకం క్రింద ఉన్నవి. రెండవ ప్రణాళికా కాలంలో గృహనిర్మాణ పథకాలకు రూ. 201.9 లక్షలు కేటాయించారు. మురికి పేటల నిర్మూలన, స్వీపర్ల గృహవసతి పథకంక్రింద 2,100 స్థలాల అభివృద్ధి, 114 ఎకరాల అభివృద్ధి, 1,030 ఇళ్లనిర్మాణం జరగవలసి ఉంది. ప్రభుత్వం సహాయంచేసే పారిశ్రామిక గృహవసతి పథకం క్రింద 3,106 ఇళ్లనిర్మాణము, తక్కువ ఆదాయ వర్గాల గృహవసతి పథకం క్రింద 5,228 ఇళ్ల నిర్మాణమూ జరగడానికి రెండో ప్రణాళికా కాలంలో తలపెట్టబడింది. గ్రామీణ గృహవసతి పథకంక్రింద 1,184 ఇళ్ల నిర్మాణం మంజూరు చేయబడింది (మే 1960 వరకు).

మూడవ ప్రణాళికలో ప్రభుత్వ సహాయం చేసే పారిశ్రామిక గృహవసతి పథకానికి రూ. 81 లక్షలు కేటాయించబడినవి. ఈ ధనంతో 2,518 క్రొత్త ఇళ్ల నిర్మాణము జరుగుతుంది. రెండో ప్రణాళికా కాలంలో పూర్తికాకుండా మిగిలి

పోయిన 589 ఇళ్ల నిర్మాణమూ పూర్తవుతుంది. తక్కువ ఆదాయ వర్గాల వసతి పథకం క్రింద రూ. 336 లక్షలు కేటాయించబడినవి. ఈ పథకం క్రింద 5,177 ఇళ్లు నిర్మింపబడుతవి. మురికిపేటల నిర్మూలన అభివృద్ధి పథకం క్రింద రూ.23 లక్షలు కేటాయించారు. ఈ ధనంతో 1,655 క్రొత్త ఇళ్లు నిర్మించడం, 1,613 స్థలాలు అభివృద్ధి చేయడం జరుగుతుంది. గ్రామీణ గృహవసతి పథకాలకు రూ. 91 లక్షలు కేటాయించడంజరిగింది. ఈ గృహనిర్మాణ పథకాలకు మొత్తం మూడో ప్రణాళికలో రూ. 535 లక్షలు ఏర్పాటుచేయడం అయింది. ఇందులో రూ. 86.95 లక్షలు మొదటి సంవత్సరంలో ఖర్చుపెట్టబడుతుంది.

ఇదీ స్థూలంగా గృహనిర్మాణ పథకాల కథ. అయితే వీటితో గృహసమస్య తీరిపోతుందని ప్రభుత్వము అనుకోవడంలేదు. రోజురోజుకూ జనాభా పెరిగిపోతున్నది. గ్రామాలు పట్నాలుగా మారిపోతున్నవి. ఈ రంగంలో ప్రభుత్వం చేస్తున్నది ఘనంగానే ఉన్నా, చెయ్యవలసినది ఇంకా ఎంతో ఉంది. ప్రయివేటు రంగం కూడా యీ పనిలో ఎంతో తోడ్పడవలసిఉంది.





మూసీ ప్రాజెక్టు (నల్గొండ జిల్లా)

# సేద్యపు నీటి పథకాలు

నదీజలాలు వృథాగా పోకుండా ఉపయోగించుకుని పంట లెక్కువగా పండించుకో వచ్చునని ప్రాచీనకాలం నుండి మనుష్యులకు తెలిసిన విషయమే. కాని యిది సాధించుకోటం మాత్రం అంత సులభమైన పనికాదు. సాధ్యమైన ఉపాయాలన్నీ ప్రయోగించి శ్రమపడ్డా మహానదుల ప్రవాహంలో ఏదో కొద్దిపాటి మాత్రమే మానవ ప్రయోజనానికి లొంగేది. మిగిలిందంతా సముద్రంలో కలవటమో, లేక మహోద్వేగంతో పొంగి పొరలి ఊళ్ళూ, పొలాలూ ధ్వంసం చేయటమో జరుగుతుండేది. మన దేశంలో ఇలాంటి నష్టం యిప్పటికీ ప్రతి యేడు అనేక ప్రాంతాల్లో చూస్తున్నాం. ఇది జరగకుండా నిలిపి వేసుకోటం ఒకటి, నిలిపివేసిన జలాల నుండి సత్ఫలితాలు సాధించుకోటం ఒకటి యిప్పటి ప్రణాళికా కాలంలో ప్రారంభించిన పెద్ద పథకాల లక్ష్యాలు. పదకొండేండ్లక్రింద వేసిన అంచనాలను బట్టి మన దేశంలో నదీ జల సంపద 135 కోట్ల 60 లక్షల యెకరా - అడుగులున్నట్లు

తేలినది. కాని దీంట్లో వ్యవసాయ ప్రయోజనానికి ఉపయోగించుకో తగ్గది 45 కోట్ల యకరా - అడుగులు మాత్రమే. మూడవ ప్రణాళిక ప్రారంభించే సరికి, వివిధ పథకాల నిర్వహణ ఫలితంగా, యీ నదీ జలాలలో 12 కోట్ల ఎకరా - అడుగుల వరకు ఉపయోగంలోకి వచ్చినవి. అంటే ఉపయోగించుకోదగ్గ మొత్తం నీటిలో 27 శాతం మాత్రం భూములకు ప్రవహించేటట్లు చేయగలిగారు. ఇకఇప్పుడునడుస్తున్న మూడవ ప్రణాళిక లక్ష్యం యీ జల సౌకర్యాన్ని 36 శాతం వరకు తీసుకోవాలని. అంటే అదనంగా 4 కోట్ల యెకరా - అడుగుల జలాలను భూమి సాగుకు ఉపయోగించుకోవలసి వుంది.

నీటి సరఫరా పెద్దవి, మధ్యరకంవి, చిన్నవి అయిన ప్రాజెక్టుల ద్వారా జరుగుతుంది. మొదటి రెండు రకాలవల్ల ప్రయోజనం విస్తారమైన ప్రదేశాలకు కలగటమే కాకుండా, వర్షంలేని రోజుల్లో అవి ఉపయోగిస్తవి. చిన్న తరహా ప్రాజెక్టులు అంటే చెరువులు మొదలయినవి తొందరగానూ చౌకగానూ తయారైనప్పటికీ, వర్షాభావం తటస్థించినప్పుడు అంతగా పనికి రావు. కాబట్టి అన్నిరకాల ప్రాజెక్టులను సమన్వయించి ఒక్కొక్క ప్రదేశపు అవసరాలు, సౌకర్యాలను బట్టి నీటి పారుదల పథకాలను నిర్మించుకోవలసి వుంది.

పదేళ్ళ క్రింద మన దేశంలో అన్ని తరహాల నీటి సౌకర్యాలవల్ల సాగవుతున్న భూమి 5.15 కోట్ల యెకరాలు; ఇందులో 2.2 కోట్ల యెకరాలు పెద్దవి, మధ్య రకంవి అయిన ప్రాజెక్టుల వల్ల ప్రయోజనం పొందేది. అంచెనా ప్రకారం, 1975-76 నాటికి, అంటే అయిదో ప్రణాళిక పూర్తి అయేటప్పటికి 8½ కోట్ల యెకరాలకు నీటి సప్లయి చేయవచ్చు. దేశంలోని అవకాశాలన్నీ ఉపయోగించుకో గలిగిన నాటికి 17½ కోట్ల యెకరాలకు యీ ప్రయోజనం లభిస్తుంది. ఈ అంచెనాలను గుర్తుంచుకొనే మూడవ ప్రణాళికా లక్ష్యాలు నిర్ణయింపబడ్డవి. ఈ ప్రణాళిక సమాప్తమయ్యే రోజుకు నీటి పారుదల సౌకర్యం గల భూమి 9 కోట్ల యెకరాలుండాలి.

మొదటి రెండు ప్రణాళికల క్రింద చేపట్టిన నీటి పారుదల పథకాల ఖర్చు రు 1400 కోట్లు కాగలదని అంచనా వేశారు. ఇవి పూర్తయిన తర్వాత 380 లక్షల యెకరాల సాగుకు ఉపకరిస్తవి. కాని యీ పదేళ్ళలో వాటి మీద ఖర్చయింది రు 750 కోట్లు మాత్రమే. పని యింకా నడుస్తున్నది కాబట్టి మూడవ ప్రణాళికా కాలంలో రు 436 కోట్లు వెచ్చించాలి. అప్పటికీ యివన్నీ పూర్తికావు. నాల్గవ

ప్రణాళికకు రు 214 కోట్లు ఖర్చు మిగిలి వుంటుంది. ఈ మిగులు పథకాలు కాక ప్రతి ప్రణాళికా కాలంలోనూ క్రొత్త పథకాలు కొన్ని బయలు దేరుతవి. ఇలాంటి వాటిమీద మూడవ ప్రణాళికలో రు 164 కోట్లు పెట్టుబడి అవుతుంది. అంటే మొత్తం నీటివనరు పథకాలమీద రు 600 కోట్లు ఖర్చుకావాలి. ఇదిగాక, వరదలను నిరోధించటం మొదలయిన ఇతర కార్యక్రమాలకి రు 61 కోట్లు అవుతవి. మూడవ ప్రణాళికలో యీ పథకాలన్నిటికీ కావలసిన విదేశీమారకం రు 50కోట్లు వుంటుంది.

ప్రాజెక్టు నిర్మాణానికి నాలుగు ముఖ్య దశలున్నవి. ఈ నాలుగూ సరిగా సమన్వయయించినప్పుడే వాటివల్ల పూర్తిగా ఫలితం లభిస్తుంది. మొదటిది నీటిని నిలువ చేయటానికి సాధకమైన డాము కట్టడం, తర్వాత కాలువలు త్రవ్వి గ్రామాలకు సప్లయి సౌకర్యం యేర్పరచటం, రైతులు తమతమ పొలాలకు నీరు చేరేట్టు చిన్నచిన్నకాలువలను త్రవ్వుకోటం, యీనీటి సరఫరా సౌకర్యంవల్ల సంపూర్ణఫలం పొందాలంటే ఆధునిక వ్యవసాయ పద్ధతులుగూడా బాగా అలవరచుకోటం అవసరం.

నీటి పారుదల పథకాల అమలులో ఉత్పన్నమయ్యే అనేక సమ్యలను గూర్చి పరిశోధనలు దేశంలో పదహారు కేంద్రాలలో నిర్విరామంగా జరుగుతున్నవి. ప్రాజెక్టు నిర్మాణం నడుస్తున్న కొద్దీ యీ పరిశోధనావసరాలు గూడా పెరుగుతున్నవి. మూడవ ప్రణాళికా కాలంలో 'ఐసొటోప్స్' ఉపయోగం, మట్టితో నిర్మాణమయ్యే డాములను గూర్చిన కొన్ని ప్రత్యేకసమస్యలు మొదలయిన వాటిని గూర్చి కొత్తగా పరిశోధనలు జరుగుతున్నవి. ఈ కార్యక్రమానికి రూ 120 లక్షలు ఖర్చు కాగలదు.

ఈ ప్రాజెక్టుల నిర్మాణానికి సాంకేతిక నిపుణులు ఎంతమందో కావాలి. రెండవ ప్రణాళికా కాలంలో పట్టభద్రులైన ఇంజనీరులు 10,900 మంది, డిప్లొమాలు పొందినవారు 24,200 మంది పనిచేశారు. మూడవ ప్రణాళికలో వీరుగాక అదనంగా 5900 పట్టభద్రులు, 12200 మంది డిప్లొమా పొందినవారు కావాలి. పట్టభద్రులు దొరుకుతారుగాని, రెండవ రకం వారు చాలినంత మంది దొరకక పోవచ్చు. అందుకని అలాంటి వారిని తయారు చేసే శిక్షణా సౌకర్యాలను ప్రణాళిక మొదటి రెండేండ్లలో తగినంతగా వృద్ధి చేయాలి. వీరు గాక సుశిక్షితులైన ఆపరేటర్లు, మెకానిక్‌లు చాలా మంది కావాలి. వీరిని తయారు చేసే కేంద్రాలు రాజస్థాన్‌లోని కోటా వద్ద ఆంధ్రప్రదేశ్‌లో నాగార్జునసాగరం వద్ద యేర్పాటయినవి.

కృష్ణా, గోదావరి నదులేకాక, వంశధార, నాగావళి, పెన్న, శారద, తాండవ, వరాహా, పంప, ఏలేరు, మున్నేరు మొదలైన చిన్న నదులెన్నో ఆంధ్రప్రదేశ్‌లో

ప్రవహిస్తున్నవి. వీటి జలం 15 కోట్ల ఎకరా - అడుగులుంటుందని అంచనా. ఇందులో మనరాష్ట్రం ఉపయోగించుకుంటున్నది 2కోట్ల 60లక్షల యెకరా అడుగులు మాత్రమే. ఇంకా 7 కోట్ల 40 లక్షల యెకరా - అడుగుల నీటినైనా యిక్కడ ఉపయోగించుకోవచ్చు; దానివల్ల అదనంగా 160 లక్షల యెకరాల మెట్ట నేలను సారవంతం చేసుకోవచ్చు.

మొదటి రెండు ప్రణాళికలలో చేపట్టిన ప్రాజెక్టుల వల్ల ఆరులక్షల యెకరాలకు పైగా ప్రయోజనం కలిగింది. మూడవ ప్రణాళికలో నాగార్జున సాగరం వదిలేస్తే మిగిలిన ప్రాజెక్టుల వల్ల అదనంగా 5,21,000 యెకరాల భూమికి నీరు లభిస్తుంది. ఇదిగాక రెండవ ప్రణాళికా కాలంలోనే సమాప్తమైన ప్రాజెక్టువల్ల అదనంగా 60000 ఎకరాలకు నీరు లభిస్తుంది. దీనివల్ల 4,45,000 టన్నుల ఆహార ధాన్యాలు అదనంగా పండించగలుగుతాము. మూడవ ప్రణాళిక లక్ష్యాలలో ఒకటి 24 లక్షల టన్నుల ధాన్యం యెక్కువ పండించాలని, పైన పేర్కొన్న 4.45 లక్షల టన్నులు గాక మిగిలిన అధికాహారోత్పత్తి. ఎరువులు, మేలిరకం విత్తనాలు, పనిముట్లు మొదలైన వాటివల్ల సాధించవలసి వుంది. రెండవ ప్రణాళిక నుండి నిర్మాణ దశలోనే మిగిలివున్న ప్రాజెక్టులలో తుంగభద్ర, కర్నూలు - కడప కాలువ, కడం ముఖ్యమైనవి. మూడవ ప్రణాళికలో 7 పెద్ద ప్రాజెక్టులు, 45 మధ్య తరహావి నిర్వహించవలసి వుంది. వీటికి రూ 28.39 కోట్లు ఖర్చవుతుంది. ఇందులో యీ మొదటి సంవత్సరంలో వ్యయం రూ 521.87 లక్షలు. వరదల నివారణకు కూడా 13 పథకాలు నిర్వహించాలి, వీటి మీద రూ 244 లక్షలు ఖర్చవుతుంది. 1961-62 లో దీంట్లో రూ 16.33 లక్షలు వ్యయం చేయాలి.

రాష్ట్రంలోని ఇంజనీరింగ్ రీసర్చి శాఖలో ఇప్పుడు పనిచేస్తున్న ఎనిమిది ఉపశాఖలు గాక, ఇంకా రెండు లేబొరేటరీలు ప్రారంభించవలసివుంది. ఉన్న వాటిలో రెండింటిని విస్తృతం చేయటం గూడా జరుగుతుంది. దీనికై రూ 40 లక్షలు కేటాయింపు జరిగింది.





ఆరోగ్య కేంద్రం, పట్టంచెరువు, (హైదరాబాదు జిల్లా)

# వైద్య, ప్రజారోగ్య సౌకర్యాలు

మొదటి రెండు ప్రణాళికల్లో చేసిన కృషి ఫలితంగా మన దేశప్రజల ఆరోగ్య పరిస్థితుల్లో కొంత అభివృద్ధి జరిగింది. ఈ అభివృద్ధికి నిదర్శనాలు - వ్యాధుల వ్యాప్తి తగ్గటం; శిశుమరణాలు తగ్గటం; మామూలుగా మరణాల సంఖ్య తగ్గటం; ఆయుర్దాయం పెరగటం.

రెండవ ప్రణాళికలో లాగానే మూడవ ప్రణాళికలోకూడా ఆరోగ్య కార్యక్రమాలను స్థూలంగా ఆరు విభాగాలుగా విభజించవచ్చును.

1. వాతావరణపు పారిశుద్ధ్యాన్ని అభివృద్ధి చేయటం-ముఖ్యంగా గ్రామాలలో, బస్తీలలో నీటి సరఫరా, 2. అంటువ్యాధుల నివారణ, 3. ఆరోగ్య సౌకర్యాల ఏర్పాటుకు ఉపకరించేందుకు వీలుగా తగిన సంస్థలను సమకూర్చటం, 4. ఆరోగ్య

వైద్యశాఖల సిబ్బందికి శిక్షణ వసతులను సమకూర్చటం, 5. కుటుంబ నియంత్రణ, 6. పరిజారోగ్య వసతులు — మాతా ప్రసూతి సంక్షేమం, ఆరోగ్య విద్య, ఆహార పుష్టితో సహా.

ఆరోగ్య కార్యక్రమాలపై మొదటి భారత ప్రణాళికలో ఖర్చు రు 140 కోట్లు. రెండవ ప్రణాళికలో రు225 కోట్లు. మూడవ ప్రణాళికలో కేటాయింపు రు 342 కోట్లు.

మూడు ప్రణాళికల్లోనూ వివిధ పద్ధతులక్రింద ఏలా పంపిణీ చేయబడిందీ క్రింది పట్టికలో చూడవచ్చు.

| | రూ. కోట్లు | | |
|---|---|---|---|
| | మొదటి ప్ర. | రెండో ప్ర. | మూడవ ప్ర. |
| 1. మంచినీటి సరఫరా, పారిశుధ్యం, గ్రామాలు, బస్తీలు | 49 | 76 | 105.3 |
| 2. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, ఆసుపత్రులు, డిస్పెన్సరీలు | 25 | 36 | 61.7 |
| 3. అంటువ్యాధుల నివారణ | 23.1 | 64 | 70.5 |
| 4. విద్య, శిక్షణ | 21.6 | 36 | 56.3 |
| 5. దేశీయ వైద్యవిధానాలు | 0.4 | 4 | 9.8 |
| 6. కుటుంబ నియంత్రణ | 0.7 | 3 | 27.0 |
| 7. ఇతర పథకాలు | 20.2 | 6 | 11.2 |

## గ్రామీణ నీటి సరఫరా

గ్రామీణ నీటి సరఫరా సమస్య అంతటా ఒకే విధంగా ఉండదు. ఒక ప్రాంతానికి మరొక ప్రాంతానికి చాలా తేడా ఉండటమే కాక, అదే ప్రాంతంలో కూడా తరచు తేడాగా ఉంటుంది. గ్రామాలలో మంచినీటి సరఫరాకు మొదటి రెండు పరిణాళికలలోను చాలా ప్రాధాన్యం చూపబడింది. గ్రామీణ నీటి సరఫరా

వసతులు నాలుగు విధాల కార్యక్రమాల క్రింద విస్తరించ బడినాయి. 1. సమాజ వికాసం, 2. స్థానికాభివృద్ధి కార్యక్రమాలు, 3. రాష్ట్ర ఆరోగ్యశాఖల మంచి నీటి సరఫరా, పారిశుద్ధ్య కార్యక్రమం, 4. వెనుకబడిన వర్గాల సంక్షేమ కార్యక్రమం. దేశీయ నీటిసరఫరా రిపారిశుద్ధ్య కార్యక్రమం కేంద్ర ఆరోగ్యశాఖకుచెందినట్టిది. ఈ కార్యక్రమంక్రింద నీటి ఎద్దడికి గురిఅయ్యే ప్రాంతాలకు, నీటిద్వారా వచ్చే జబ్బులు ప్రాంతీయంగా వున్న చోట్లకు ప్రాధాన్యం చూపబడింది.

గ్రామీణ నీటి సరఫరా పథకానికి మూడో ప్రణాళికలో రు. 67 కోట్లు కేటాయింపబడినవి.

## బస్తీల్లో నీటి సరఫరా

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలిచ్చే ఋణాలతో పురపాలక సంఘాలు బస్తీ నీటి సరఫరా పథకాలను అమలు పరుస్తున్నవి. మొదటి ప్రణాళిక చివరకు బస్తీ నీటి సరఫరా కార్యక్రమానికి భారీ ఎత్తున పూనుకొనటం జరిగింది. మూడో ప్రణాళికలో ఈ కార్యక్రమంలో వేటికి ప్రాధాన్యం చూపబడుతుందో దిగువ పేర్కొనబడింది.

1. ఎట్టి సురక్షితమైన మంచి నీటి సరఫరా ఏర్పాట్లు లేకుండా వున్న పురపాలక ప్రాంతాలు.
2. ప్రస్తుతపు ఏర్పాట్లు తగినంతగా లేనట్టి లేదా ప్రజారోగ్యం దృష్ట్యా భద్రంగా లేనట్టి బస్తీ ప్రాంతాల్లో ఇప్పటి వసతులను అభివృద్ధి పరచటం లేదా విస్తరించటం.
3. యాత్రా కేంద్రాలు.
4. పంపులద్వారా నీటి సరఫరా జరుగుతున్న ప్రాంతాలు; మురుగును తొలగించి ప్రజారోగ్యానికి ప్రమాదం నివారించడానికి ఇప్పటి మురుగు పారుదల ఏర్పాట్లను అభివృద్ధి పరచటం.

రెండవ ప్రణాళికలో బస్తీ నీటి సరఫరా పథకాల అనుభవం బట్టి మూడు ముఖ్య సూచనలు చేయబడినాయి. మొదటిది బస్తీ నీటి సరఫరా పథకాలను ముఖ్యముగా పెద్దవాటిని జాగ్రత్తగా అంచెలవారీగా ఏర్పాటు చేయాలి. అలా అయితే ప్రాజెక్టుకు చెందిన వివిధ భాగాలు పరస్పరం సమతూకంలో ఉండి ప్రతి దశలో

పెట్టిన ఖర్చు గిట్టుబాటుగా ఉంటుంది. ఆలస్యాలను ఆపాలంటే పథకాలను అంచనాలను సాంకేతికంగా పరిశీలించాలి. రెండవ విషయం. ఉన్న డబ్బును బాగా ఉపయోగపడేటట్టు వినియోగించాలంటే ఆ డబ్బును అనేక పథకాలకు పల్చపల్చగా వాడకుండా నివారించటం మంచిది. అంటే కొన్ని నిర్దిష్ట ప్రమాణాల ప్రకారం పథకాలను జాగ్రత్తగా ఎంచుకోవాలి. మూడవ విషయం. ఒక ప్రాజెక్టును ఆమోదించటం జరిగాక దానికి సంబంధించిన పురపాలక సంఘం దాని నిర్వహణ బాధ్యతతో పాటు రాష్ట్ర ప్రభుత్వ నిర్ణయం ప్రకారం నిర్మాణపు ఖర్చులో కొంత భాగాన్ని కూడా భరించవలసి ఉంటుంది.

బస్తీల్లో నీటి సరఫరాకు, మురుగు నీటి పథకాలకు మూడో ప్రణాళికలో రూ. 80 కోట్లు కేటాయింపబడినవి.

## ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు

రెండవ ప్రణాళిక ముగింపునాటికి దేశంలో 2,800 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు ఏర్పాటు అయివుంటాయి. మూడో ప్రణాళికా కాలంలో సమాజ వికాస ఉద్యమాన్ని విస్తరించటంతోపాటు దాదాపు అన్ని అభివృద్ధి మండలాల్లోనూ ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు ఏర్పాటు చేయబడతాయి. ఆసుపత్రుల, డిస్పెన్సరీల సంఖ్య 1951 లో 8,600 నుంచి 1961 లో 12,600 వరకు పెరిగి ఉంటుంది. అదే కాలంలో పడకల సంఖ్య 113,000 నుంచి 160,000 కు పెరిగి ఉంటుంది. మూడవ ప్రణాళిక లక్ష్యం అదనంగా మరో రెండు వేల ఆసుపత్రులనూ, డిస్పెన్సరీలనూ తెరవటం, కొత్తగా 54,500 పడకలు ఏర్పాటు చేయటం.

## అంటు వ్యాధులు

మొదటి ప్రణాళికలో అంటు వ్యాధులను అదుపులో పెట్టడానికీ నివారించడానికీ రు. 23 కోట్లు ఖర్చు పెట్టడం జరిగింది. రెండో ప్రణాళికలో యీ పద్దు క్రింద రు. 64 కోట్లు ఖర్చు పెట్టారు. మూడో ప్రణాళికలో రు. 70 కోట్లు ఖర్చు చేయడానికి నిశ్చయింపబడింది. అంటు వ్యాధుల నివారణ కార్యక్రమంలో మలేరియా, బోదకాలు, క్షయ, కుష్ఠు, మశూచికం, కలరా, గొంతువ్యాధి, సుఖవ్యాధుల నివారణ పథకాలు చేర్చబడినాయి.

వీటిలో మలేరియా నివారణ కార్యక్రమం చాలా ముఖ్యమైనది. ఇది మొదటి ప్రణాళికలో ప్రారంభించబడింది. ఆ ప్రణాళిక ముగింపు నాటికి 133 నివారణ కేంద్రాలు పనిచేస్తూ ఉన్నాయి. రెండవ ప్రణాళికలో వీటి సంఖ్య మొదట్లో 200 కు పెంచబడింది. తర్వాత నివారణ కార్యక్రమాన్ని నిర్మూలన కార్యక్రమంగా మార్చినప్పుడు కేంద్రాల సంఖ్య 390 కి పెంచబడింది. ఈ కార్యక్రమంవల్ల మలేరియా చాల వరకు అదుపులోకి తీసుకురాబడింది. మూడో ప్రణాళికా కాలంలో యీ వ్యాధి పూర్తిగా నిర్మూలించడానికి ప్రయత్నాలు జరుగుతాయి.

మొదటి రెండు ప్రణాళికల్లోనూ బోదకాలు నివారణ కార్యక్రమం అమలు జరుపబడింది. మూడో ప్రణాళికలో కూడా యీ వ్యాధి నివారణ కేంద్రాలు కొనసాగించ బడుతవి. వీటితోపాటు యీ వ్యాధి వ్యాపించివున్న ప్రాంతాల్లో మురుగు పారుదల పథకాలు అమలు పరచడానికి కూడా తీవ్రమైన ప్రయత్నం జరుగుతుంది.

మూడో ప్రణాళికలో మశూచి నివారణ కార్యక్రమంలో ముఖ్యాంశాలు:—
1. చాలమంది టీకాలు వేసే ఉద్యోగులను నియోగించి వారికి శిక్షణను చేకూర్చటం, 2. ప్రజలకు, టీకాలు వేయటం, 3. టీకా మందు సరఫరాను అధికం చేయటం. ఈ కాలంలోనే బి. సి. జి. టీకా కార్యక్రమం తీవ్రతరం చేయబడుతుంది. క్షయ క్లినిక్ కార్యక్రమం కూడా విస్తరించబడుతుంది. 1966 చివరకు క్షయ రోగులకు మొత్తం 30,000 పడకలు దేశంలో ఉండటానికి ఏర్పాట్లు చేయడం జరుగుతుంది. అదనంగా అయిదు క్షయ శిక్షణ, ప్రదర్శన కేంద్రాలను ఏర్పాటు చేస్తారు.

రెండో ప్రణాళిక చివరకు కుష్ఠు వ్యాధి నివారణకు 135 పరిశీలన, చికిత్సా కేంద్రాలు ఏర్పాటు చేయబడినవి. మూడో ప్రణాళికా కాలంలో మరో వంద కేంద్రాలు తెరువ బడతవి. జబ్బు ప్రాంతంలో ప్రతి ఆసుపత్రిని ప్రాథమిక ఆరోగ్య కేంద్రాన్ని కుష్ఠు నివారణ కృషికి కేంద్రంగా ఏర్పాటు చేయాలని భావించబడింది.

సుఖ రోగాలు పెద్ద నగరాల్లోనూ, పారిశ్రామిక ప్రాంతాల్లోనూ జాస్తి. రెండవ ప్రణాళికలో, యీ రోగ నివారణకు 75 జిల్లా 'క్లినిక్కులు' 8 ప్రధాన నగర క్లినిక్కులు ఏర్పాటు చేయబడినాయి. మూడో ప్రణాళికలో కొత్తగా మరో 100 జిల్లా క్లినిక్కులూ, 6 ప్రధాన నగర క్లినిక్కులూ నెలకొల్పబడుతాయి.

గొంతుక జబ్బులు, కలరా వ్యాధి నివారణ పథకాలు కూడా ప్రణాళికలో చేర్చ బడినాయి. కలరా నివారణలో వాతావరణ పారిశుద్ధ్య అభివృద్ధులకు ప్రత్యేక ప్రాముఖ్యం చూపబడుతోంది.

వైద్య ఆరోగ్య సిబ్బంది శిక్షణ వసతుల్లో స్థిరాభివృద్ధి జరుగుతోంది. మూడో ప్రణాళికలో కొత్తగా పద్దెనిమిది వైద్య కళాశాలలు తెరువబడతాయి. దీంతో దేశంలో వైద్య కళాశాలల సంఖ్య 75 కు పెరుగుతుంది. మూడో ప్రణాళికలో ప్రతి ఆరువేల మందికీ ఒక వైద్యుడు ఉంటాడు. అంతకు ముందు ప్రణాళికలో కూడా ఇదే నిష్పత్తి ఉంది. పోస్టు గ్రాడ్యుయేటు వైద్య విద్యకు మూడో ప్రణాళికలో రూ. 3.5 కోట్లు కేటాయింపబడినవి. మొదటి ప్రణాళికలో ఆరంభం నుంచి కూడా నర్సులు, తదితర అనుబంధ సిబ్బందియొక్క వసతుల విస్తరణకు ప్రాముఖ్యం చూపబడింది. మూడవ నాల్గవ ప్రణాళికల కీలక కార్యక్రమాల్లో కుటుంబనియంత్రణ ఒకటి. అయితే యీకార్యక్రమం చాలాచిక్కులతో కూడిఉన్నది. ఫలితాలకు కొంతకాలం పట్టక తప్పదు. మొదటి ప్రణాళికలో స్వల్ప స్థాయిలో ఆరంభమై ఇప్పుడిది విస్తరించింది. మొదటి ప్రణాళికలో 126 నగర కుంటుంబ నియంత్రణ క్లినిక్కులూ, 21 గ్రామీణ క్లినిక్కులూ ప్రారంభింప బడినవి. రెండవ ప్రణాళికా కాలంలో అదనంగా 423 నగర క్లినిక్కులూ, 1079 గ్రామీణ క్లినిక్కులూ ప్రారంభింప బడినవి. మొదటి ప్రణాళికలో యీ పద్దుకింద కేటాయింపు రూ. 65 లక్షలు. రెండో ప్రణాళికలో రూ. అయిదుకోట్లు మూడో ప్రణాళికలో కేటాయింపు రూ. ఇరవయ్యేడు కోట్లు.

రాష్ట్రంలో వివిధ ప్రజారోగ్య పథకాలకూ వైద్య కార్యక్రమానికీ రెండో ప్రణాళికలో 729.74 లక్షలు కేటాయింపబడినవి. మూడోప్రణాళికలో యీ కేటాయింపు రూ. 1198.60 లక్షలు. మూడో ప్రణాళిక మొదటి సంవత్సరంలో రూ. 198.84 లక్షలు ఖర్చుపెట్టబడుతవి. ప్రతిజిల్లా కేంద్రంలో ఉన్న ఆసుపత్రి అభివృద్ధి చేయబడుతుంది. ప్రణాళిక అంతానికి ప్రతిజిల్లా ఆసుపత్రిలోను 250 కు తక్కువ లేకుండా పడక వసతులు ఏర్పాటు అవుతాయి. మొత్తం రాష్ట్రంలో 300 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు ప్రారంభింప బడుతాయి. 1966 నాటికి ప్రతిఅభివృద్ధి మండలంలోను ఒక ఆరోగ్య కేంద్రం ఉంటుంది. వైద్య కళాశాలల్లో విద్యార్థుల సంఖ్య 720 నుండి 1025 వరకు పెంచబడుతుంది. అంటువ్యాధుల నిరోధానికి నివారణకు తగిన చర్యలు తీసుకొన బడతాయి.

మశూచి నివారణా కార్యక్రమానికి రూ. 63.50 లక్షలు ఖర్చు పెట్టబడుతవి. దీనివల్ల ఒక కోటిన్నర జనానికి వ్యాధి రాకుండా కాపాడడానికి చర్యలు తీసుకోబడుతుంది. బోదకాలు వ్యాధి విజయనగరం, గుంటూరు, మెట్టపల్లి, కొడంగల్ ప్రాంతాల్లో ఎక్కువ. అందువల్ల ఇప్పటి వ్యాధి నిరోధక కేంద్రాలకు తోడు మరో మూడు కేంద్రాలు మూడో ప్రణాళికా కాలంలో కొత్తగా స్థాపించబడుతవి. ఈ కార్యక్రమానికి రూ. 28.75 లక్షలు కేటాయించారు. కలరా నిరోధ కార్యక్రమానికి ఒకలక్షరూపాయలు కేటాయించడం జరిగింది. బి.సి.జి. కార్యక్రమంకూడా మూడో ప్రణాళికాకాలంలో విస్తరించబడుతుంది. ఇప్పుడున్న 15 బి. సి. జి. దళాలకు తోడు మరో మూడు కొత్తగా స్థాపింపబడతాయి. 21 క్షయ చికిత్సా కేంద్రాలు కూడా తెరవబడతవి. క్షయ రోగులకు అదనంగా 2500 పడకలు ఏర్పాటుచేస్తారు. కనీసం పదిహేను కుష్ఠురోగ నివారణ కేంద్రాలైనా మూడో ప్రణాళికలో తెరవబడుతవి. సుఖరోగ చికిత్సా కేంద్రాలు 20 ప్రారంభింపబడతవి.

ఈ కాలంలోనే కొత్తగా 9 నగర కుటుంబ నియంత్రణ కేంద్రాలు 360 గ్రామీణ కేంద్రాలు స్థాపింపబడతాయి.

దేశీయ వైద్య విధానాలను ప్రోత్సహించేటందుకు మూడో ప్రణాళికలో రూ. 28 లక్షలు కేటాయింపబడినవి.





సనత్ నగర్ (హైదరాబాదు) లోని పారిశ్రామిక వాడలో ఒక కర్మాగారం

# పారిశ్రామిక విస్తరణ

పెద్ద పెద్ద రాజకీయ పరివర్తనాలు జరిగిన యే దేశాల్లోనైనా మొట్టమొదట ఆ పరివర్తనా సమయంలో కలిగిన నష్టాలను పూరించుకోటానికీ, తర్వాత క్రొత్త వ్యవస్థను సుస్థిరం చేసుకోటానికి ప్రయత్నాలు జరగటం సహజం. మన దేశంలో పరపాలన నుండి స్వపాలనకు జరిగిన పరివర్తన శాంతియుతంగా జరిగింది కాబట్టి, మొదటి తరహా ప్రయత్నానికి అంత అవసరం లేకపోయింది; ఇక రెండవది, స్వాతంత్ర్యాన్ని సుస్థిరం చేసుకోవాలంటే అన్ని విధాల దేశానికి బల సౌష్ఠవాలు చేకూర్చుకోవాలి. అన్నిటికంటె ప్రధానమైనది ఆర్థిక బలం. అది యితరుల సహాయం మీద, దయాదాక్షిణ్యాల మీద ఆధారపడి వుండదు. మన పరిశ్రమ, దానివలన యేర్పడ్డ సంపద మీద ఆధారపడివుంటుంది. మనుష్య బలం, ప్రకృతి సంపద విస్తారంగా వున్న మన దేశాన్ని పారిశ్రామికంగా పురోగమించిన దేశాలతో

సమానస్థాయికి తీసుకురావటం అసాధ్యమైన పనిగాదు. రష్యా మొదలైన దేశాలలో యిలాంటి మహా ప్రయత్నం యీ మధ్యనే జరగటం, తత్ఫలితంగా అవి ప్రపంచ రాజకీయాల్లో యెలాంటి స్థానం ఆక్రమించుకున్నవో మనం చూస్తూనే వున్నాము. మన ప్రజలుగూడా అలాంటి సక్రమమైన కృషివల్ల ఆర్థిక ఫలితాలు సాధించ టానికే యిప్పటి దేశీయ ప్రణాళికలో పారిశ్రామికరంగానికి ప్రాధాన్యం పెంచబడు తున్నది. మూడవ ప్రణాళికలో ఆర్థిక స్వాతంత్ర్యానికి అత్యవసరమైన పరిశ్రమలు, అంటే ఉక్కు, యంత్ర నిర్మాణం మొదలైన వాటికి ప్రాముఖ్యత యివ్వబడింది. ఇందువల్ల యంత్రాలను ఇతర దేశాలనుండి దిగుమతి చేసుకోవలసిన అక్కర తగ్గిపోతుంది. మనం యెగుమతి చేయగల పదార్థాల ఉత్పత్తిని బాగా వృద్ధిచేయాలి. ప్రజల నిత్యోపయోగానికి కావలసిన వస్తువుల ఉత్పత్తి ముఖ్యంగా ప్రైవేటు రంగంలో జరుగవలసివుంది. ఈ విధానాలవల్ల మూడవ ప్రణాళికా కాలంలో పారిశ్రామికోత్పత్తి 70 శాతం వృద్ధి పొందగలదు. ఇనుము, ఉక్కు, యంత్రసామగ్రి, రసాయనిక పదార్థాల ఉత్పత్తి క్రమంగా 168, 143, 150 శాతం వుంటుంది. అల్యూమినియమ్ ఉత్పత్తి మూడవ ప్రణాళికలో 80,000 టన్నులకు పెంచవలసివుంది. రాగి ఉత్పత్తి 8900 టన్నుల నుండి 20,000 టన్నుల వరకు పెరుగుతుంది. ప్రణాళిక ముగించే టప్పటికి 30,000 కార్లు, 60,000 లారీలు మొద లైనవి ఉత్పత్తి అవుతవి. బైసికిళ్ళ ఉత్పత్తి 10,50,000 నుండి 20,00,000 వరకూ పెరుగుతుంది. ఎరువుల ఉత్పత్తి గూడా బాగా పెరుగుతుంది. సల్ఫ్యూరిక్ ఆసిడ్ 15 లక్షల టన్నుల వరకు, కాస్టిక్ సోడా 340,000 టన్నుల వరకూ ఉత్పత్తి అయ్యేట్టు చూడాలి. సిమెంటు ఉత్పత్తి 130 లక్షల టన్నులకు పెరుగుతుంది. బట్టలు, కాగితం, చక్కెర, నూనెలు, గడియారాలు మొదలయిన వాటి ఉత్పత్తి గూడా మూడవ ప్రణాళికలో బాగా వృద్ధి చేయవలసి ఉంది.

మూడవ ప్రణాళికలో చిన్న పరిశ్రమల అభివృద్ధికి గూడా విస్తృతమైన కార్యక్రమం నిర్ణయింపబడినది. దీనిలో ఒక ముఖ్యాంశం పారిశ్రామిక వాడలను పలుచోట్ల నెలకొల్పటం. రెండవ ప్రణాళికా కాలంలో ఇవి 120 వరకు మంజూ రయినవి. మూడవ ప్రణాళికలో క్రొత్తగా 300 పారిశ్రామిక వాడలు తెరవబడుతవి.

ఇవిగాక కొన్ని గ్రామీణ ప్రాంతాల్లో ప్రత్యేకంగా గ్రామీణ పారిశ్రామిక వాడలు గూడా యేర్పాటవుతవి. చేతి మగ్గాలు మరమగ్గాల మీద తయారైయే వస్త్రం, ఖాదీ కలిసి యిప్పుడుత్పత్తిఅయ్యే 235 కోట్ల గజాల నుండి 350 కోట్ల గజాల వరకు వృద్ధి అవుతుంది. ముడి సిల్కు ఉత్పత్తి 26 లక్షల పౌనుల నుండి 50 లక్షల వరకూ పెరుగుతుంది.

మూడవ ప్రణాళికలో పరిశ్రమల అభివృద్ధికి, ప్రభుత్వ, ప్రైవేటు రంగాలు రెంటింటిలోనూ కలిసి రు. 2455 కోట్లు కావలసి వుంటుంది. ఇందులో రు. 1338 కోట్లు విదేశీ మారకం కావాలి. ఇప్పుడు పాతబడిపోయిన యంత్రాలు మొదలైన వాటికి బదులుగా క్రొత్తవాటిని యేర్పరుచుకోటానికి ఇంకా 150 కోట్ల రూపాయలు కావాలి. దీంట్లో 50 కోట్ల వరకు విదేశీ మారకం. కాని యిప్పటి కేటాయింపులను బట్టి చూస్తే ప్రారంభించే పరిశ్రమల కన్నిటికీ కావలసినంత ధనం లేనట్లే. కొంత కార్యక్రమం నాల్గవ ప్రణాళికలోనికి మిగిలిపోక తప్పదు. పెద్దపెద్ద ప్రాజెక్టులాగే పెద్ద పెద్ద పరిశ్రమలు గూడా చాలా కాలానికి గాని నిర్మాణదశలో నుంచి బయట పడవు. వాటి ఫలితం తర్వాతి ప్రణాళికలలోనే కనబడుతుంది.

పెద్ద పరిశ్రమలను నెలకొల్పడంలో గమనించవలసిన ముఖ్య విషయం ఒకటి నీటి సప్లయిని గూర్చి. ఉక్కు, నూనె పరిశుద్ధి, ఎరువుల కర్మాగారాల వంటివి నడపటానికి ధారాళంగా నీరు లభించే సౌకర్యం ఉండాలి. ఇతర పరిశ్రమలలో నీరు అంత చేటు ఉపయోగించక పోయినా, వాటి చేరువలో నివసించవలసిన కార్మికులు, ఉద్యోగులు మొదలైన వారికి తగినంత నీటి సదుపాయం కావాలి. అందు వల్లనే యీ మధ్య క్రొత్త పరిశమల స్థాపనకు కేంద్రాలు నిర్ణయించటంలో యీ సౌకర్యం విషయం ముఖ్యంగా విచారించబడినది. కొన్ని స్థలాలు తక్కిన అన్ని విషయాల్లో అనుకూలంగా వున్నా తగినంత నీటి సదుపాయం లేకపోవటం వల్ల నిరాకరించబడ్డవి. ఇలాగే, రసాయనిక పదార్థాలకు సంబంధించిన పరిశ్రమల విషయంలో, ఉపయుక్తంగాని ద్రవపదార్థలన్నీ బైటికి పోవటానికి సరియైన సదుపాయం వుండాలి; లేకపోతే చేరువలో ఉన్న నదీజలాలు మొదలైనవి చెడి పోయి ప్రజారోగ్యానికి ప్రమాదం కలుగవచ్చు.

ఆంధ్రప్రదేశ్ మూడవ ప్రణాళికలో పెద్ద పరిశ్రమలకై రూ 6 కోట్ల 65 లక్షలు కేటాయించ బడ్డవి. ఇందులో యీ యేడు రూ. 2 కోట్ల 11 లక్షలు ఖర్చవుతవి.

రెండవ ప్రణాళికా కాలంలోనే రాజమహేంద్రవరం కాగితపు మిల్లు విస్తరణ కార్యక్రమం ప్రారంభం అయింది. ఇది మూడవ ప్రణాళికలో కొనసాగుతుంది. ఈ మిల్లులో ఉత్పత్తి సంవత్సరానికి 2000 టన్నుల నుండి 18000 టన్నులకు పెరగ వలసి వుంది. దీనికి రూ 4 కోట్లు ఖర్చవుతవి. ప్రణాళిక అంతానికి యీ మిల్లులో రోజుకు 50 టన్నుల కాగితం తయారవుతుంది.

పారిశ్రామికాభివృద్ధి కేంద్రాలనే పేరుతో మూడు ప్రాంతాలను మన రాష్ట్రంలో నెలకొల్ప బోతున్నాము. వీటిలో రెండు ఆంధ్ర ప్రాంతంలోను ఒకటి తెలంగాణా లోను వుంటవి. రైళ్ళ సౌకర్యం వున్నచోట తగిన స్థలాలను తీసుకొని, వాటిని ఫ్యాక్టరీలు నెలకొల్పటానికి తగినట్లుగా విభజించి, విద్యుచ్ఛక్తి, నీళ్ళు, రోడ్లు మొదలైన సౌకర్యాలన్నీ యీ కేంద్రాల్లో యేర్పరుస్తాము. ఇక్కడ బయలుదేరే పరిశ్రమలకు రాష్ట్రంలో యితర చోట్ల ఉన్న పరిశ్రమలకు లభించే సౌకర్యాలన్నీ లభిస్తవి. ఈ కేంద్రాలకై రూ. 75 లక్షలు కేటాయించబడ్డవి.

పరిశ్రమల అభివృద్ధి కార్పొరేషన్ అనే సంస్థను నెలకొల్పటానికి ఇంకో పథకం వుంది. దీనికై కేటాయించింది రూ. 108 లక్షలు. ప్రభుత్వమే ఒక కోటి రూపాయల పెట్టుబడితో దీన్ని ప్రారంభిస్తుంది. తర్వాత యీ పెట్టుబడి మూడు కోట్లకు పెంచబడుతుంది. కొత్త పరిశ్రమలను నెలకొల్పటం, ఆర్థిక, సాంకేతిక విషయాలను గూర్చి పరిశోధనలు చేయటం మొదలైన పనులే గాక, యీ సంస్థ ప్రైవేటు రంగంలోని పరిశ్రమలకు సహాయం కూడా చేస్తుంది.

మూడో ప్రణాళికా కాలంలో సనత్‌నగర్‌లోని టాజ్‌గ్లాస్ ఫ్యాక్టరీని ప్రభుత్వం తీసుకొని అభివృద్ధి చేస్తుంది. దీనికి రు. 17 లక్షలు ఖర్చవుతుంది. సహకార రంగంలో రెండు చక్కెర ఫ్యాక్టరీలు కొత్తగా నెలకొల్పబడుతవి. ఒకటి ఆంధ్ర ప్రాంతంలో, ఒకటి తెలంగాణాలో. వీటి పెట్టుబడి కోసం రు 20 లక్షలు కేటా యించబడ్డవి. ఇదిగాక క్రిందటి ప్రణాళికలోనుంచి వస్తున్న ఫ్యాక్టరీలకు పెట్టుబడి కోసం రు. 25 లక్షలు కేటాయించారు.

చిన్న తరహా పరిశ్రమలను విరివిగా విస్తరింపజేయటం మూడవ ప్రణాళికలో ఒక ముఖ్య లక్ష్యం. ఇలాంటి వాటికి తోడ్పడటానికి పారిశ్రామిక సహకార బ్యాంకు ఒకటి హైద్రాబాదులో యేర్పడుతుంది. ఇందుకు రు. 10 లక్షలు కేటాయించబడ్డవి. ప్రభుత్వ పరిశ్రమల శాఖలో కొత్తగా వివిధ రంగాలలో నిపుణులైనవారిని ప్రత్యే

కోద్యోగులుగా నియమిస్తారు. దీనికి రు. 25 లక్షలు ప్రత్యేకించారు. చిన్న తరహా పరిశ్రమల అభివృద్ధి కార్పొరేషనుకు ఉపాంగాలుగా హైద్రాబాదులో 'ఛైన్ స్టోర్సు' కొన్ని యేర్పడతవి. వీటి కొక్కొక్కదానికి రు 25000 పెట్టుబడిగాయిస్తారు. ఈ పథకానికి మొత్తం రు. 25 లక్షలు అవుతుంది. ఇంకా పరిశ్రమలకు చట్ట ప్రకారం ఋణాలివ్వటానికి రు. 70 లక్షలు, తోళ్ళ పరిశ్రమను వృద్ధిచేయటానికి ప్రత్యేకంగా కోటి రూపాయలు కేటాయించబడ్డవి. ప్రజలకు నిత్యం అవసరమైన వస్తువులను చేసే పరిశ్రమలు - తాళాలు, ట్రంకులు, రేడియో పరికరాలు మొదలైనవి తయారు చేసేవి - ముప్పై వరకూ కొత్తగా స్థాపించబడతవి. కుటీర పరిశ్రమలలో శిక్షణ యియ్యటానికి కొన్ని కేంద్రాలు గూడా యేర్పాటవుతవి.

పారిశ్రామిక వాడలవల్ల ప్రయోజనం యిప్పటికే బాగా గ్రహింపబడ్డది. మూడో ప్రణాళికలో ప్రతి జిల్లాకు ఒకటైనా యీ వాడలు యేర్పాటవుతవి. పైగా 18 గ్రామీణ పారిశ్రామిక వాడలు గూడా తెరువబడతవి. దీనికోసం రు 220 లక్షలు ప్రత్యేకించబడినవి.

చేతి పనులకు సిల్కు, ఊలు, నార పరిశ్రమలకు తగిన కేటాయింపులున్నవి. చేనేత పరిశ్రమకు మన రాష్ట్రం పేరుబడ్డది. దీన్ని ఇంకా అభివృద్ధి పరచటానికి, ఉత్పత్తి అయిన వస్త్రం అంతా అమ్ముడు పోయే మార్గాలు చూడటానికి మూడవ ప్రణాళికలో విస్తృత కార్యక్రమం ఉన్నది. చేనేత పనివారిని నిపుణులుగా తయారు చేసే టెక్స్టైల్ ఇన్స్టిట్యూట్ - ఒకటి రాష్ట్రంలో యేర్పడబోతుంది. దీని కోసం రు. 8 లక్షలు కేటాయింపు జరిగింది.

మొత్తం మీద యీ చిన్న తరహా పరిశ్రమలు, చేనేత పరిశ్రమ మొదలైన వాటికన్నిటికీ రు 12 కోట్ల 67 లక్షలు కేటాయించబడ్డవి. దీనిలో యీ యేడు ఖర్చయ్యేది రు 2,36,49,000.





గూడూరులో అభ్రికపు గనులు

# ఖనిజ పరిశోధన

ప్రజాళికాయుగం ప్రారంభమయిం తర్వాత గత శతాబ్దంలో దేశంలో ఖనిజాల ఉత్పత్తి బాగా పెరిగింది. 1950 లో ఉత్పత్తి అయిన ఖనిజాల విలువ రూ. 83 కోట్లు. ఇదే 1960 లో రూ. 159 కోట్లు. ముఖ్యంగా ముడి యినుము తయారీ చాలా వృద్ధి పొందింది. 1950 లో ఉత్పత్తి అయిన ముడి యినుము 29,70,000 టన్నులు; క్రిందటి యేడు యీ ఉత్పత్తి 1,05,20,000 టన్నులు. ఇంతటి శీఘ్ర పురోగమనానికి కారణం దేశంలో ఉక్కు ఉత్పత్తి బాగా విస్తరింప జేయటం, జపాను మొదలైన దేశాలకు ఎగుమతులు పెరగటం, మ్యాంగనీస్ ఉత్పత్తి మాత్రం 8,80,000 టన్నుల నుండి 11,60,000 టన్నులకు మాత్రమే పెరిగింది. ఈ పదేళ్ళలోనే బొగ్గు ఉత్పత్తి 3,23,10,000 టన్నులనుండి 5,18,10,000 టన్నులకు, సున్నపురాయి 29,20,000 టన్నుల నుండి 1,25,30,000 టన్నులకు, ఇల్మెనైటు 2,13,000 టన్నుల నుండి 2,46,000 టన్నులకు, ముడిరాగి 360,000 టన్నుల నుండి 4,41.000 టన్నులకు వృద్ధి పొందినవి.

భూగర్భంలో దాగివున్న లోహాలనుగూర్చి పరిశోధనలు జరపటానికి అవసర మైన పటాలు తయారు చేయవలసివుంది. మైలుకు ఒక అంగుళం గుర్తుగా తయారు చేయబడ్డ పటాలు దేశ విస్తీర్ణతలో 24 శాతం వరకు వర్తించేవి ద్వితీయ ప్రణాళిక ప్రారంభంలో వుండేవి. రెండవ ప్రణాళికా కాలంలో యీ పరిమితిలో తయారైన పటాలు ఇంకా 40,000 చదరపు మైళ్ళకు వర్తించినవి. లోహ సంపదవున్న 5775 చదరపు మైళ్ళ భూభాగానికి ఇంకా పెద్ద పటాలు తయారైనవి. ఈ ప్రణాళికా కాలంలో జరిగిన పరిశోధనలవల్ల చాలా రకాల ఖనిజ సంపద వున్నచోట్లు బయలు పడ్డవి.

మూడవ ప్రణాళికలో పారిశ్రామికాభివృద్ధికి ఇదివరకటి కంటె యెక్కువ ప్రాముఖ్యత వున్నది. అందుకని పరిశ్రమలకు అత్యవసరమైన లోహాలను త్రవ్వి తీసే పని కూడా ఇతోధికంగా జరగాలి. ఇతర దేశాలనుంచి దిగుమతి అవుతున్న ఖనిజాలను వీలైనంత వరకు ఇక్కడే వుత్పత్తి చేసుకొనే ప్రయత్నం జరగాలి. ఇలాంటి ఖనిజాలు దాగివున్నచోట్లు కనిపెట్టటానికి నిరంతర పరిశోధనలు జరగాలి. ముడి యినుము, బొగ్గు, సున్నపురాయి, బాక్సైట్, జిప్సమ్ మొదలైనవి ఇంకా యెక్కువ అవసరమవుతవి. ఇవి లభించే కొత్త స్థలాలు కనిపెట్ట వలసివుంది. అవి కనిపెట్టినచోట్ల కొత్త గనుల తెరిచి విరివిగా పనిసాగించవలసివుంది.

ఈ ఖనిజ పరిశోధనలకు, ఉత్పత్తి కార్యక్రమానికి మూడవ ప్రణాళికలో పబ్లికు రంగంలో రూ. 478 కోట్లు కేటాయింపబడ్డది. ఇందులో రూ. 200 కోట్లు విదేశీ మారకం. ప్రైవేటు రంగంలో రు. 60 కోట్లవరకూ ఖర్చవుతుంది. ఇందులో రు. 28 కోట్లు విదేశీ మారకం వుంటుంది.

దేశంలో రైలు మార్గాలు విస్తరిస్తున్నకొద్దీ వాటికి బొగ్గు సప్లయి అధికంగా కావాలి. విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి కూడా బొగ్గు కావాలి;. ఉక్కు, సిమెంటు మొదలైన పరిశ్రమలకు కూడా బొగ్గు అవసరం యెక్కువవు తున్నది. ఈ అవసరాలన్నీ గమ నించి మూడవప్రణాళిక తుది సంవత్సరంలో దేశంలో కావలసిన బొగ్గు 9,70,00,000 టన్నులు వుంటుందని అంచనా వేయబడ్డది. రెండవ ప్రణాళిక అంతానికి నిర్ణ యించిన ఉత్పత్తి మీద ఇది 3,70,00,000 టన్నులు అధికం. రెండవ ప్రణాళికకు నిర్ణయించిన 6,00,00,000 టన్నుల ఉత్పత్తి పూర్తిగా సాధింపబడకపోయినా, కావలసిన పెట్టుబడి జరిగింది. 1961 మార్చి నెలలో ఉత్పత్తి 52,70,000 టన్నులు. అంటే 1960-61 సంవత్సరానికి జరుగవలసిన ఉత్పత్తి ప్రకారం నెలనెలకూ ఉండ

వలసిన దానికంటె అధికమే. రెండవ ప్రణాళికలో జరిగిన అధికోత్పత్తిలో ప్రైవేటు రంగంనుండి వచ్చింది అదివరకే ఉన్న గనుల నుండి మాత్రమే. కాని పబ్లికు రంగంనుండి వచ్చిన ఉత్పత్తి చాలా వరకు క్రొత్తగనులవల్ల మూడవ ప్రణాళికలో కావలసిన బొగ్గు అంచనా చాలా పెద్దది. కాబట్టి పబ్లిక్‌రంగం పనిలో క్రొత్త గనులను తెరవవలసి వున్నది. పెట్టుబడి కూడ అధికంగా కావలసివుంది. అధికంగా కావలసిన 3 కోట్ల 70 లక్షల టన్నులలో పబ్లికు రంగం నుంచి 2 కోట్ల టన్నులు ఉత్పత్తి కావలసివుంది. ఇందులో 30 లక్షల టన్నుల వరకు సింగరేణి గనుల విస్తరణవల్ల లభిస్తుంది. మిగిలింది నేషనల్ కోల్ డెవలప్‌మెంటు కార్పొరేషన్ ద్వారా ఉత్పత్తి కావలసివుంది. ఈ పబ్లిక్ రంగం పెట్టుబడి అంతా కలిసి రు. 103 కోట్లు ఉంటుంది. ఇదిగాక ఇంకా నాల్గవ ప్రణాళికలో బొగ్గు ఉత్పత్తి కార్యక్రమానికై ముందుగా ఇప్పుడే పెట్టుబడి పెట్టవలసింది రు. 10 కోట్లు వుంటుంది.

మూడవ ప్రణాళికా కాలంలో మైనింగ్ ఇంజనీరింగ్‌లో పట్టభద్రులైన వారు 3000 మంది కావలసి వుంటారు. అంతకంటె తక్కువ విద్యావంతులు 37,000 వరకూ కావాలి. ఇతర సాంకేతిక సిబ్బంది కూడా కొంత కావలసి వుంటుంది. దీనికై వివిధ రాష్ట్రాలలో సాంకేతిక విద్యా సౌకర్యాలు వృద్ధి చేయబడుతున్నవి. సింగరేణి గనులలో కొత్తగా యేర్పడ్డ అప్రెంటిస్ కోర్సు యిలాంటి సౌకర్యాలలో ఒకటి.

మనదేశపు ముడిఇనుము ఇంకా యెక్కువగా కావాలని జపాను, యూరపు లోని దేశాలు కోరుతున్నవి. మూడవ ప్రణాళికా కాలంలో ఇలా యెగుమతి చెయ్య వలసిన ముడి యినుము ఒక కోటి టన్నుల వరకూ వుంటుంది. దీనితో పాటు మన పరిశ్రమలకు కావలసింది కూడా కలిపి మొత్తం 3 కోట్ల 20 లక్షల టన్నులు ఉత్పత్తి కావలసివుంది. ఇదే మాదిరి ఇతర ఖనిజాల అవసరం కూడా పెరుగుతుంది. ఉదాహరణకు, ప్రస్తుతం దేశంలో 70,000 టన్నుల రాగి కావలసివుంది. 1965 నాటికి యీ అక్కర 150,000 టన్నుల వరకూ పెరగవచ్చు. కాని ఇప్పుడు దేశంలో ఉత్పత్తి అవుతున్నది 800 టన్నులు మాత్రమే. .మిగిలినదంతా దిగుమతి చేసుకో వలసి వస్తుంది. కాబట్టి దేశంలో ఉత్పత్తి బాగా అధికం చేసుకోవలసి వుంది.

ఆంధ్రప్రదేశ్‌లో యింకా ఖనిజాలు చాలా వరకు భూగర్భంలో అణిగి మణిగి ఉన్నవి. ఇనుము, క్రోమైట్, గ్రైఫైట్, స్టియటైట్, ఫెల్స్‌పార్, సున్నపురాయి

మొదలైనవాటి విషయంలో ఎంతగానో పరిశోధనకు, ఉత్పత్తికి అవకాశాలున్నవి. మూడవ ప్రణాళికా కాలంలో రు. 11 లక్షల ఖర్చుతో మూడు ప్రత్యేక పథకాలు అమలులో పెట్టటానికి సంకల్పించారు. ఇందులో యీ సంవత్సరం ఒక లక్ష 83 వేలు ఖర్చవుతవి.

రాష్ట్రంలో అనేక స్థలాలకు భూగర్భ శాస్త్ర విషయమైన పటాలు ప్రస్తుతం లేవు. ఇవి ఉంటేనే కాని పరిశోధనలు జరగటానికి అవకాశం లేదు. బంగారం, వజ్రాలు, ఇనుము, మ్యాంగనీస్, మైకా, క్రోమైట్, గ్రెఫైట్, పాలరాయికి సంబంధించిన స్థల చిత్రాలు సత్వరంగా తయారు చేయవలసివుంది. ఈ కార్యక్రమానికి 56 వేల రూపాయలవుతుంది. 77,000 యెకరాల స్థలంలో యీ పని జరుగుతుంది.

ఎక్కడైనా మౌలిక పరిశ్రమల స్థాపనకు కొన్ని ప్రధానమైన ఖనిజాలు సమృద్ధిగా ఉండటం అత్యవసరం. ఇలాంటి ఖనిజాలను గూర్చి పరిశోధన జరపటం యిప్పుడు రాష్ట్ర ప్రభుత్వాల బాధ్యత. ప్రైవేటు రంగం కూడా యిందులో సహాయ పడుతుంది. ఆంధ్రప్రదేశ్‌లో యిదివరకు కొంత పని జరిగింతర్వాత వదలివేసిన బంగారు గనులు, వజ్రపు గనులు మొదలైనవి కొన్ని ఉన్నవి. వీటిలోను, ఇనుము మొదలైన ఇతర లోహాల విషయంలోను విపులంగా పరిశోధనలు జరపటానికి మూడవ ప్రణాళిక క్రింద ఆరు లక్షల నలభై నాలుగు వేల రూపాయలు ఖర్చవుతవి. పదహారు వేల యెకరాల ప్రదేశంలో యీ పరిశోధనలు జరుగుతవి.

త్రవ్వి తీసిన ముడి లోహాల విలువను గూర్చి రసాయనిక పరీక్షలు జరగాలి. దీనికై లేబొరేటరీ సౌకర్యాలు విస్తృతం చేయవలసి వుంది. దీనికి నాలుగు లక్షల రూపాయలవుతుంది.





# పంటల పెంపుదలకు పథకాలు

అభివృద్ధి ప్రణాళికలు సక్రమంగా అమలు జరగడానికి దేశంలో పరిశ్రమలను విరివిగా నెలకొల్పడానికీ ముందు ఆహార ధాన్యాలను సమృద్ధిగా పండించడం అత్యంతావశ్యకం. ఈ దృష్ట్యా గత దశాబ్దంలో వ్యవసాయ కార్యక్రమాలపైన నీటి పారుదల వసతుల విస్తరణ పైన భారీ యెత్తున పెట్టుబడి పెట్టటం జరిగింది.

మూడో ప్రణాళికా కాలంలో తీవ్రకృషి చేయవలసిన భారీ కార్యక్రమాలు ఇవి. 1. నీటిపారుదల, 2. భూసార సంరక్షణ, మెట్టవ్యవసాయం, భూమిపునరుద్ధరణ, 3. రసాయనిక ఎరువుల, మామూలు ఎరువుల సరఫరా, 4. విత్తనాల అధికోత్పత్తి, సరఫరా, 5. మొక్కల సంరక్షణ, 6. మేలు రకం నాగళ్లు, పనిముట్లు.

మూడవ ప్రణాళికలో ప్రస్తుతం ఉద్దేశింపబడిన వ్యవసాయోత్పత్తి లక్ష్యాలు దిగువ క్లుప్తంగా పేర్కొనబడినాయి.

| పంట | పరిమాణం | 1960-61లో ఉత్పత్తి | 1965-66 నాటికి లక్షిస్తున్న ఉత్పత్తి |
|---|---|---|---|
| 1. ఆహారధాన్యాలు | మిలియన్ టన్నులు | 76. 0 | 100. 0 |
| 2. నూనె విత్తులు | ,, | 7. 1 | 9. 8 |
| 3. చెరకు - బెల్లం | ,, | 8. 0 | 10. 0 |
| 4. ప్రత్తి | మిలియన్ బేళ్లు | 5. 1 | 7. 0 |
| 5. జనపనార | ,, | 4. 0 | 6. 2 |
| 6. కొబ్బరి | మిలియన్ కాయలు | 4500 | 5275 |
| 7. పోకచెక్క | వేల టన్నులు | 93 | 100 |
| 8. జీడి పప్పు | ,, | 73 | 150 |
| 9. మిరియం | ,, | 26 | 72 |
| 10. యాలకాయ | ,, | 2.26 | 2.62 |
| 11. లక్క | వేల, టన్నులు | 50 | 62 |
| 12. పొగాకు | ,, | 300 | 325 |
| 13. తేయాకు | మిలియన్ పౌన్లు | 725 | 900 |
| 14. కాఫీ | వేల టన్నులు | 88 | 80 |
| 15. రబ్బరు | ,, | 26.4 | 45 |

మూడో ప్రణాళికలో మొత్తం వ్యవసాయోత్పత్తి కార్యక్రమాలకు రు 1280 కోట్లు కేటాయింపబడినాయి. ఇందులో నీటి పారుదల కార్యక్రమాలూ, భూసార సంరక్షణ పథకాలూ- సహకార కార్యక్రమాలూ కూడ చేరివున్నవి.

ఆహారధాన్యాల పంటలన్నిటిలోకీ ముఖ్యమైనది వరి. మన దేశంలో మొత్తపు సాగు భూమిలో నాల్గవ భాగానికి పైగా వరికిందనే ఉన్నది. ఒక్క రాజస్థాన్ మినహా కొద్దిగానో గొప్పగానో వరి పండించని రాష్ట్రమేదీ లేదు. పర్వత ప్రాంత మైన కాశ్మీర్‌లో కూడా వరి పండించబడుతున్నది. ప్రభుత్వం వరిసాగు విషయంలో పెక్కు పరిశోధనలు జరిపించింది. అధికముగా జపాను పద్ధతి ఉత్తమమైనదని కనుగొనబడింది. మూడవ ప్రణాళికా కాలంలో జపాన్ పద్ధతి వరి సాగుకు ఎక్కువ ప్రోత్సాహ మివ్వబడుతుంది. ఈ పద్ధతి ఏమంత కష్టమైనదికాదు. ప్రతిరైతు శ్రమ పడితే ఈ పద్ధతి ప్రకారం సులువుగా సేద్యం చేసి మంచి ఫలితాలను సాధించ వచ్చును.

## మన రాష్ట్రంలో

ప్రజల ఆదాయం వ్యవసాయం పైన అధికంగా ఆధారపడి ఉండే మన దేశంలో ఆంధ్ర ప్రదేశ్ వంటి రాష్ట్రం ఎక్కువ ప్రాధాన్యత వహిస్తుంది. 1959-60 లో 2,80,00,000 ఎకరాలు అంటే రాష్ట్రపు మొత్తం విస్తీర్ణంలో నూటికి 43 వంతులు సేద్యం కాబడుతోంది. ఆహార ధాన్యాల విషయంలో ఆంధ్రప్రదేశ్ స్వయం సమృద్ధమే కాక అదనంగా ఉత్పత్తి చేయటం వల్ల దక్షిణాదికి ప్రధాన ధాన్యాగారంగా పరిగణించబడుతున్నది. రెండవ పంచవర్ష ప్రణాళిక ప్రారంభమై నప్పుడు రాష్ట్ర జనాభా 312.6 లక్షలు. మూడవ ప్రణాళిక చివరకు జనాభా 414.3 లక్షలవరకు పెరగవచ్చునని అంచనా. క్రమేపీ అధిక మవుతున్న రాష్ట్ర ఆహార అవసరాలను తీర్చడమే కాక ఆహార కొరతకు లోనైన ఇతర రాష్ట్రాలకు ఎగుమతి చేయవలెనంటే అవకాశమున్నంతవరకు ఆహార ధాన్యాలను మన రాష్ట్రం పండించ వలసి వుంటుంది. ఈ అధికాహారోత్పత్తి కొనసాగించటానికి విస్తృత, సాంద్ర వ్యవసాయ పథకాలను విరివిగా అమలు జరుపవలసి వుంటుంది.

రెండవ ప్రణాళికలో దేశం మొత్తం మీద పరిశ్రమాభివృద్ధికి ప్రాధాన్యం యివ్వబడటమయింది కాని, వ్యవసాయమే ముఖ్య పరిశ్రమగా ఉన్న ఆంధ్ర ప్రదేశ్‌లో వ్యవసాయానికి ప్రాధాన్యం యివ్వక తప్పిందికాదు. అధికమవుతున్న జనా భాకు కావలసిన ఆహారధాన్యాలను, పరిశ్రమలకు కావలసిన ముడిసరుకులను స్వయం సమృద్ధంగా పండించడమే రెండవ ప్రణాళిక ముఖ్యాశయం. వ్యవసాయాభివృద్ధి

పథకాలు ఈ ఆశయానికి అనుగుణంగా రూపొందించబడ్డాయి. ఈ కాలంలో అదనంగా 16.43 లక్షల టన్నుల ధాన్యాన్ని ఉత్పత్తి చేయాలని లక్షింపబడింది.

మూడవ ప్రణాళిక చివరకు అదనంగా 24.04 లక్షల టన్నుల ఆహార ధాన్యాలను ఉత్పత్తి చేయాలని లక్ష్యం. ఈ లక్ష్యసాధనకు వ్యవసాయ పరికరాలను రైతులకు సకాలంలో సులభంగా అందుబాటు చేయటం అవసరం. మంచిరకాల విత్తనాలు ఉత్పత్తి చేయడం ఆ విత్తనాలను పదిల పరచటం కూడా అవసరం. ప్రణాళికా కాలంలో విత్తనాల క్షేత్రాలు విస్తృతం చేయడమే కాక ప్రతి అభివృద్ధి కేంద్రంలోనూ మరొక విత్తనాల గిడ్డంగి నిర్మించబడుతుంది. ఈ కార్యక్రమానికి రు. 200 లక్షలు ఖర్చు అవుతుంది. పట్టణ ప్రాంతాల్లోను, గ్రామా ప్రాంతాల్లోనూ కంపోస్టు ఎరువులు తయారు చేయడానికి పథకాలు వేయబడ్డాయి. వర్షపాతం అధికంగావుండే ప్రాంతాలలో భూసారాన్ని కాపాడేటందుకు రు 60,000 ప్రత్యేకించబడ్డాయి. మేలురకం విత్తనాల సరఫరాకు రు 40.50 లక్షలు ఖర్చు చేయబడతాయి సస్యసంరక్షణవల్ల ఉత్పత్తిని అధికం చేయడానికి వీలవుతుంది. మూడవ ప్రణాళికా కాలంలో సస్యసంరక్షణ కార్యక్రమాలకు రు 82.50 లక్షలు వినియోగింపబడతాయి.

వ్యవసాయ విస్తరణ కార్యక్రమాలకు పరిశోధనలు అవసరం అనే విషయం అనుభవం వల్ల తేలింది. మూడవ ప్రణాళికలో ఇలాంటి పరిశోధన కార్యక్రమాలు గూడా ఉన్నవి

మూడవ ప్రణాళికలో వ్యవసాయ రంగంలో మొత్తం 222 పథకాలు చేర్చబడినవి. వీటి కయ్యే ఖర్చు రు 1087.82 లక్షలు. ఈ మొత్తంలో 1961-62 సంవత్సరానికి రు 188.80 లక్షలు ఖర్చు చేయబడతాయి.

## జిల్లా సాంద్రవ్యవసాయ పథకం

ఈ సందర్భంలో ముఖ్యంగా ఉదహరించవలసిన దొకటి జిల్లా సాంద్రవ్యవసాయ పథకం. ఈ పథకాన్ని ఇటీవల మన రాష్ట్రంలో ప్రవేశపెట్టారు. దేశంలోని ఆహార కొరతకు స్వల్పమయిన ఫలసాయమే ముఖ్యకారణం. వరి పండించే యితర దేశాలతో పోల్చిచూస్తే మనదేశంలో ఎకరాకు ఫలసాయం చాల తక్కువని

రుజువవుతున్నది. ఎకరానికి ఇటలీలో 4615 పౌన్లు, జపానులో 4198 పౌన్లు, ధాన్యం పండుతున్నప్పుడు మన దేశంలో ఎకరా ఫలసాయం 1236 పౌన్లు మాత్రమే.

అమెరికన్ ఫోర్డు ఫౌండేషన్ వ్యవసాయ శాస్త్రవేత్తలు మన దేశంలో అధికమైన ఫలసాయానికి కొన్ని మార్గాలను సూచించారు. ఈ సూచనలను ఆధారంగా చేసుకుని 1959 సంవత్సరంలో భారత ప్రభుత్వం సాంద్రవ్యవసాయ పథకాన్ని రూపొందించింది. మేలు రకం విత్తనాలు, ఎరువులు, తెగుళ్ళమందులు, సులభంగా లభ్యమయ్యే ఋణాలు వీటిద్వారా నీటి పారుదల సౌకర్యాలు ఉన్న సారవంతమైన భూములలో ఉత్పత్తిని అధికం చేయడమే యీ పథకం యొక్క ఆశయం.

భారత ప్రభుత్వం యీ పథకాన్ని ఏడు రాష్ట్రాల్లో ప్రవేశపెట్టింది. వాటిలో ఆంధ్రప్రదేశ్ ఒకటి. మన రాష్ట్రప్రభుత్వం పశ్చిమ గోదావరి జిల్లాలో యీ పథకాన్ని డిసెంబరు 1960 లో ప్రవేశపెట్టింది. మొదటి సంవత్సరంలో నూటికి 20 వంతులు విస్తీర్ణముతో ప్రారంభించి అయిదేళ్ల తరువాత నూటికి 60 వంతులు భూమిని ఈ పథకం క్రిందికి తీసికొని రాగలందులకు నిర్ణయించడమయింది.

## మార్కెటింగ్ సౌకర్యాలు

లాభదాయకమైన ధరలకు విక్రయించ గలిగినప్పుడే ఆహారోత్పత్తికి రైతాంగం చేసేకృషి ఫలిస్తుంది. క్రమబద్ధమైన మార్కెటింగు సౌకర్యాలు లేనిదే ఇది సిద్ధించదు. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్‌లో 78 క్రమబద్ధమైన మార్కెట్లు పని చేస్తున్నవి. సంవత్సరానికి రు 60 కోట్లు విలువగల 12 లక్షల టన్నుల పంటలు యీ మార్కెట్ల ద్వారా విక్రయమవుతున్నవి. ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలకు సంబంధించిన చట్టాలను సమన్వయించే ఒక సమగ్ర మార్కెటింగ్ శాసనాన్ని త్వరలో ప్రవేశ పెట్టదలచారు.

వ్యవసాయ దినుసులను సేకరించి పదిలపరచే సదుపాయాలను కలుగచేయుటానికి 1958 సెప్టెంబరులో కోటి రూపాయల మూలధనంతో ఆంధ్రప్రదేశ్ గిడ్డంగుల కార్పొరేషన్ ఒకటి హైదరాబాదులో నెలకొల్పబడ్డది. ఇందుకు

కార్పొరేషన్ పెట్టుబడి రెండున్నర లక్షలు, రాష్ట్రప్రభుత్వ పెట్టుబడి రెండున్నర లక్షలు. అనుకున్న ప్రకారం రెండవ పంచవర్ష ప్రణాళికలలోనే 16 గిడ్డంగుల నిర్మాణం పూర్తి అయింది. మూడవ పంచవర్ష ప్రణాళిక చివరకు 30 గిడ్డంగుల వరకు నిర్మాణం చేయాలని సంకల్పించ బడింది.

ప్రస్తుత పరిస్థితులలో మన రైతు సోదరులు నిర్వహించ వలసిన పాత్ర బహుముఖ్యమైనది. వారు కష్టపడి ఆహార ధాన్యాలను ఎక్కువగా పండిస్తేనే దేశపు ఆర్థిక వ్యవస్థ బలపడుతుంది. ప్రణాళికలు జయప్రదమవుతాయి. 'అధికాహారోత్పత్తిని సాధించాలి' అనేదే నేటి ముఖ్యనినాదం.





అరకులోయలో కుట్టుపని నేర్చుకుంటున్న గిరిజన స్త్రీ

# సాంఘిక సంక్షేమ పథకాలు

ఐశ్వర్యంతో తులతూగుతూ, ఆరోగ్యంగా, సుఖంగా ఉన్న వారు ఎప్పుడో ఒకప్పుడు దయాబుద్ధితో కష్టపడుతున్న వారికి దాన ధర్మాలు చేయటమే సంఘ సేవ అనుకునే రోజులు ఉండి ఉండవచ్చు. కాని రాను రాను సంఘసేవ అనే మాటకు అర్థం బాగా పెరిగిపోయింది. ఇప్పటి ప్రణాళికా యుగంలో అన్నిటితో పాటు సంఘంలో లోపాలను సరిదిద్ది అన్ని రకాలవారికి చక్కని బాటలు నిర్మించటం జాతి బాధ్యత అయింది. అందుచేత జాతీయ ప్రణాళికలలో సాంఘిక సంక్షేమ కార్యక్రమం ప్రాధాన్యత పొందటమే కాకుండా క్రమక్రమంగా విస్తృతమవుతూ

వచ్చింది. రెండవ ప్రణాళికలో పదిహేను కోట్ల రూపాయలు దీనికై ఖర్చు పెట్టితే మూడవ ప్రణాళిక కేటాయింపు రు. 28 కోట్లు. ఇందులో రు. 16 కోట్లు కేంద్రం చేయవలసిన వ్యయం, మిగిలిన రు. 12 కోట్లు రాష్ట్రాల ఖర్చు. కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ ద్వారా దేశంలో వివిధ సంస్థలకు లభించే ధనసహాయం, సంక్షేమ విస్తరణ పథకాలు మొదలైన కార్యక్రమానికే రు. 12 కోట్లు కేటాయించారు. బాలల శ్రేయస్సుకు, పసిపాపల చదువు సౌకర్యాలకు కొన్ని పథకాలు మూడు కోట్ల రూపాయల వ్యయంతో అమలు పరుస్తారు. ఇతర కార్యక్రమంలో వృద్ధులు నిస్సహాయులు అయిన పౌరులకు తోడ్పడటానికి గూడా కొన్ని కొత్త పథకాలు తయారవుతున్నవి.

ఆంధ్రప్రదేశ్‌లో మూడవ ప్రణాళికలో సాంఘిక సంక్షేమ కార్యక్రమానికి 83 లక్షల 9 వేల రూపాయలు ఖర్చు చేయదలచారు. ఇందులో యీ మొదటి సంవత్సరం ఖర్చు 15 లక్షల 39 వేల రూపాయలు.

బీద కుటుంబాలకు చెందిన వితంతువులు, నిస్సహాయులు అయిన వనితలకు రక్షణగా ఏర్పాటయిన సేవాసదనాలు ఇంకా విస్తరింపజేయవలసి ఉంది. అనంతపురం, కర్నూలులో ఉన్న సదనాలకు భవన నిర్మాణం జరుగుతుంది. స్త్రీ సంక్షేమ పథకాలను శీఘ్రతరంగా అమలు జరపటానికి ప్రతి జిల్లాలోను క్రొత్త ఆఫీసర్లు నియమింపబడతారు. అనధికార సంఘాలకు గ్రాంట్లు ఇవ్వడానికి ఆరు లక్షల 83 వేల రూపాయలు కేటాయింపబడ్డవి. రాష్ట్రంలో ఇప్పుడున్న పది సంక్షేమ విస్తరణ పథకాలు రాష్ట్ర సాంఘిక సంక్షేమ సంఘం అధ్వర్యాన నడుస్తున్నవి. వీటికై యీ ఆర్థిక సంవత్సరంలో ఒకలక్ష 38 వేల రూపాయలు ఖర్చవుతవి.

బాలల సంక్షేమం కోసం రు. 15 లక్షల ఖర్చుతో 12 బాల సదనాలు స్థాపించబడతవి. ఇవిగాక తల్లులకు పిల్లల పెంపకాన్ని గురించి నిపుణుల సలహాలు అందించటానికై మూడు క్లినిక్కులు గూడా స్థాపించబడతవి. బాల బాలికలకు ఆటపాటల్లో సాంస్కృతిక విషయాల్లో ఉత్సాహం కలగజేయటానికి 28 బాల విహారాలు నెలకొల్పబడతవి. వీటికి ఐదు లక్షల రూపాయలు ఖర్చవుతవి.

కారాగారాలు మొదలైన వాటి నుండి విడుదలైన వారు మళ్లా సంఘంలో శాంతంగా జీవనం చేయగలిగే వరకు వారికి తగు సదుపాయం కలిగించేందుకు

స్టేట్ హోమ్స్ అని, డిస్ట్రిక్టు షెల్టర్స్ అని రాష్ట్రంలో ఏర్పడ్డవి. వీటిని నడపటమే కాకుండా మూడవ ప్రణాళికా కాలంలో ఇంకొక స్టేట్ హోమ్, మరి నాలుగు డిస్ట్రిక్టు షెల్టర్లు నెలకొల్పబడతవి. యుక్త వయస్సు రానివారు కూడా కొన్ని నేరాలు చేసి శిక్షితులవుతుంటారు. వీళ్ళని సీనియర్, జూనియర్ సర్టిఫైడ్ స్కూళ్ళు అనే సంస్థలకు పంపుతారు. ఇప్పుడు అలాంటి సంస్థలు మన రాష్ట్రంలో లేకపోవటం వల్ల యీ విషయంలో మద్రాసు, మైసూరు రాష్ట్రాల మీద ఆధారపడి వున్నాము. మూడవ ప్రణాళికా కాలంలో మన రాష్ట్రంలో కూడా బాలురకోసం ఒక జూనియర్ సర్టిఫైడ్ స్కూలు, యువకులైన నేరస్థులకు ఒక సీనియర్ సర్టిఫైడ్ స్కూలు స్థాపించబడతవి. డెబ్బై ఏళ్ళు దాటి నిస్సహాయులైయున్న వృద్ధులకు పించనులియ్యవలెనని ప్రభుత్వం నిశ్చయించింది. దీనికోసం ప్రణాళికలో రు. 25 లక్షలు కేటాయించబడ్డవి.

భిక్షాటన వల్ల జీవించే వారికి గూడా ఒక సక్రమమైన ఏర్పాటు జరగటం అత్యవసరం. వాళ్ళ మంచికే కాకుండా, ప్రజలకు గూడా ఎక్కడబడితే అక్కడ బిచ్చగాండ్లెదురై చేతులు చాచుతూ వుండటమనే చిరాకు గూడా తప్పించవలసి ఉంది. బిచ్చగాళ్ళలో కాళ్ళూ, చేతులూ బాగా వున్న వారికి తగిన పని చూపిస్తే చేయగలుగుతారు. భిక్షుకసదనాలేర్పరచి యిలాంటి సహాయం చేయవలెననే నిశ్చయం జరిగింది. మూడవ ప్రణాళిక క్రింద రెండున్నర లక్షల రూపాయలిందుకు ఖర్చవుతవి.

విముక్త జాతులు, షెడ్యూల్డు తరగతులు, ఇతర వెనుకబడిన తరగతుల వారి శ్రేయస్సు కోసం ప్రత్యేకంగా మూడవ ప్రణాళికలో రు. 232 లక్షల 30 వేలు ఖర్చు అవుతవి. దీంట్లో యీ సంవత్సరం వ్యయం రు. 38 లక్షల 70 వేలు.

విముక్త జాతుల వారు కుటీర పరిశ్రమలు నెలకొల్పుకోటానికి ప్రభుత్వం ధనసహాయం చేస్తుంది. తాళ్ళు పేనే యంత్రాలు, తేనెటీగల పెట్టెలు కూడా వారికి సప్లయి చేయబడతవి. వ్యవసాయానికి కావలసిన పనిముట్లు, ఎడ్లు మొదలయినవి సమకూర్చటమే కాక, నీటి సప్లయికోసం బావులు మరమ్మతు చేయటం, పంపుసెట్లు ఏర్పాటు కూడా జరుగుతుంది. 1249 ఇండ్లు కట్టుకోటానికి వ్యక్తిగతంగా ఋణాలివ్వబడతవి.

ఎనిమిదివేల హరిజన విద్యార్థులకు స్కాలర్‌షిప్పులు ఇస్తారు. కొత్తగా 19 ప్రభుత్వ హాస్టళ్ళు నెలకొల్పటమే కాకుండా, ప్రయివేటు సంస్థలు నడిపే

హరిజన హాస్టళ్ళలో 4,000 మందికి బోర్డింగ్ గ్రాంట్లు ఇస్తారు. హరిజన విద్యార్థులకు ఉచితంగా దుస్తులు, పుస్తకాలు, పలకలు మొదలైనవి సప్లయి చేయడానికి మూడవ ప్రణాళికలో రు 8 లక్షలు కేటాయింపబడ్డవి. దీనివల్ల 35,000 మంది విద్యార్థులకు ప్రయోజనం కలుగుతుంది. చేతి పరిశ్రమలల్లో నిమగ్నులైన 6 000 కుటుంబాలకు కావలసిన ముడిపదార్థాలు, పనిముట్లు దొరుకుతవి. హరిజన వాడల్లో 750 బావులు త్రవ్వుతారు. బీదవారైన హరిజనులకు 4,375 ఇండ్లు కట్టుకోటానికి ధన సహాయం లభిస్తుంది. ఇంకా హరిజనులకు గృహ నిర్మాణం కోసం 25,000 స్థలాలు ఏర్పాటుచేస్తారు. అపరిశుభ్రమైన పనులలో వున్న వారి పరిస్థితులు బాగుచేయటానికి, పాకీ బక్కెట్లు తలమీద మోసుకుపోయే అలవాటు రద్దుచేయటానికి చర్య తీసుకోబడుతుంది.

ఇతర వెనుకబడిన తరగతులవారి బిడ్డలకు గూడా 2,000 స్కాలర్ షిప్పులు మంజూరవుతవి. బడిపిల్లలకు మధ్యాహ్న భోజన సదుపాయం చేయబడుతుంది. వడ్రంగం, కమ్మరిపని మొదలైన పరిశ్రమలమీద ఆధారపడిన 12,000 కుటుంబాలకు సహాయం లభిస్తుంది. ఈ విధంగా 33 ప్రత్యేక పథకాలక్రింద వీరికి సహాయం దొరుకుతుంది.

గిరిజనుల అభివృద్ధికోసం క్రిందటి రెండు ప్రణాళికలలో విరివిగా కార్యక్రమం జరిగింది. మూడో ప్రణాళికలో వీరి కోసం రు 304 లక్షల 61 వేలు కేటాయించ బడ్డవి. దీంట్లో 1961-62 లో ఖర్చయ్యేది రు 58 లక్షల 10 వేలు.

గిరిజనులకోసం ఏర్పడే ప్రాథమిక పాఠశాలల్లో వ్యవసాయం, అడవుల్లో వస్తువులను సేకరించటంలో ప్రాంతీయ కుటీర పరిశ్రమలకు సంబంధించిన శిక్షణ కూడా ఉండాలి. ఇందుకు తగ్గ ఉపాధ్యాయులను తర్ఫీదు చెయ్యాలి. గిరిజనులు తమ బిడ్డలను బళ్ళోకి పంపేట్లు చేయాలంటే పుస్తకాలు, బట్టలూ మొదలైనవి సప్లయి చేయటమే కాకుండా మధ్యాహ్న భోజన సదుపాయం కూడా చేయాలి. స్కాలర్ షిప్పులు, హాస్టలు వసతి, పరీక్ష ఫీజు మొదలైనవి కూడా వారికివ్వవలసి ఉంది. ఇందుకోసం, మూడవ ప్రణాళికక కాలంలో ఇదివరకు నడుస్తున్న ఆశ్రియ పాఠశాలలను వృద్ధిచేయటమే కాకుండా క్రొత్తగా తొమ్మిందింటిని ప్రారంభించి వాటికి భవన నిర్మాణం గూడా చేయటానికి సంకల్పించబడింది. 30 హాస్టళ్లు తెరవబడతవి. 12,000 విద్యార్థులకు మధ్యాహ్నభోజన సదుపాయం ఏర్పడుతుంది. 1,65,000 మంది కొండజాతి పిల్లలకు దుస్తులు, పుస్తకాలు కొనుక్కోటానికి ధన

సహాయం చేయబడుతుంది. హాస్టలు భవనాలు కొత్తగా మూడు నిర్మించబడతవి. శిక్షితులైన ఉపాధ్యాయులు ఏజన్సీ ప్రాంతాల్లో పనిచేయటానికి వీలుగా వారికై 400 ఇండ్లు నిర్మించ బడతవి. ఈ కార్యక్రమానికి రు 40 లక్షలు ఖర్చవుతవి. గిరిజన ప్రాంతంలో వ్యవసాయ పద్ధతులు బాగుపరచటానికి మంచి అవకాశం ఉన్నది. ఇందుకు ప్రస్తుతం నడుస్తున్న ప్రదర్శన కేంద్రాలేకాక ఇంకా మూడు పైలట్ కేంద్రాలు ప్రారంభించబడతవి. వ్యవసాయ పద్ధతులు ప్రదర్శించే మేస్త్రీలుగా 30 మంది గిరిజనులకు శిక్షణ ఇస్తారు. ఇదేమాదిరి 120 మంది గిరిజనులకు తోటలు పెంచటంలో శిక్షణ యియ్యబడుతుంది. 375 కుటుంబాలకు నాగళ్లు, ఎద్దుబండ్లు సప్లయి చేయబడతవి. ఈ పనులకన్నిటికీ రూ 13 లక్షలు వ్యయమవుతుంది.

చెంచువారికి సరియైన వస్త్రధారణం అలవరచవలసి ఉంది. ఇందుకు వారికి దుస్తులు సప్లయిచేయటానికి రు 5 లక్షలు ఖర్చవుతవి. అడవుల్లోదొరికే వస్తువులతో లాభకరమైన పరిశ్రమలు నడుపుకోవచ్చు. గిరిజనుల కీవృత్తులు నేర్పటానికి శిక్షణా కేంద్రాలు నడుప బడుతున్నవి. మూడవ ప్రణాళికా కాలంలో కొత్తగా ఏడు కేంద్రాలు వడ్రంగంలోనూ, చాపలు నేయటంలో ఒకటి, దర్జీపనికి ఒకటి, నారపనికి ఒకటి, బీడీల తయారీకి ఒకటి ప్రారంభించబడతవి. పట్టు పరిశ్రమకోసం విశాఖపట్నం జిల్లా చింతపల్లిలో రు 4 లక్షలఖర్చుతో ఒకపథకం అమలు జరుపబడుతుంది. ఇలా కుటీర పరిశ్రమల వృద్ధికి రు 15 లక్షలవుతుంది.

గిరిజనుల సౌకర్యం కోసం కొత్తగా రోడ్లు నిర్మించటానికి, చిన్న చిన్న నీటి పారుదల సౌకర్యాలు, వైద్యశాలలు మొదలైనవి ఏర్పరచటానికి గూడ పథకాలున్నవి. గిరిజనులకోసం ఏర్పడ్డ కో - ఆపరేటివ్ ఫైనాన్స్ అండ్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ అనే సంస్థ ఇప్పుడు నాలుగు జిల్లాలలోనే పనిచేస్తుంది. దీని కార్యక్రమం రాష్ట్రమంతటికి వ్యాపిస్తుంది. బొంబాయిలో ఉన్న మాదిరి అటవీ కార్మిక సహకార సంఘాలు మన రాష్ట్రంలో కూడా నెలకొల్పాలని సంకల్పించాం.





ఒంగోలు ఎద్దు

# పశు, మత్స్య సంపద అభివృద్ధి

యాంత్రిక ప్రక్రియలు లేని భారతీయ వ్యవసాయిక వ్యవస్థలో పశు సంతతి ప్రాధాన్యం గురించి ఎంత చెప్పినను తక్కువే. ప్రపంచంలోని వివిధ ప్రాంతాలలో పశువులను అధికంగా పాలకోసం మాత్రమే వినియోగించుకుంటారు. భారతదేశంలో పరిస్థితి వేరు.

మనదేశంలో సుమారు 15 కోట్ల 90 లక్షల ఎద్దులు, ఆవులు, 4 కోట్ల 50 లక్షల గేదెలు. 3 కోట్ల 90 లక్షల గొర్రెలు, $5\frac{1}{2}$ కోట్ల మేకలు, $9\frac{1}{2}$ కోట్ల కోళ్లు ఉన్నాయి. మన ప్రణాళికల్లోని సమగ్ర పటిష్ఠ వ్యవసాయ కార్యక్రమంలో పశుపోషణ ఒక భాగంగా ఎంచబడింది. మొదటి రెండు పంచవర్ష ప్రణాళికలలోను పశు పోషణకు రు. 29 కోట్లు ఖర్చుచేయబడినవి. మొదటి ప్రణాళికక్రింద 146 కీలక గ్రామ మండలాలు ఏర్పాటు చేయబడినాయి. రెండవ ప్రణాళికక్రింద కొత్తగా 196 మండలాలు ఏర్పాటు అయినవి. 1960 చివరకు 670 కృత్రిమ

సంతానోత్పత్తి కేంద్రాలు ఏర్పాటు చేయబడినవి. రెండవ ప్రణాళిక చివరకు 4,000 పశువైద్యశాలలూ, డిస్పెన్సరీలు స్థాపించబడినవి.

మూడవ ప్రణాళికలో పశు పోషణకు రు. 54 కోట్లు కేటాయించబడినవి. ఈ కాలంలో ప్రతిఅభివృద్ధి మండలానికి కనీసం ఒక పశువుల ఆసుపత్రి లేదా డిస్పెన్సరీ అయినా ఉండగలదని భావించబడుతోంది. పారుడువ్యాధి నిర్మూలన కార్యక్రమంక్రింద రెండవ ప్రణాళిక చివరకు 9 కోట్ల గోజాతి పశువులు, గేదెలు దున్నపోతులు సంరక్షణ పొందాయి. మూడవ ప్రణాళిక మొదటి మూడు సంవత్సరాల్లో 4 కోట్ల 10 లక్షల పశువులకు టీకాలు వేయబడతాయి. అంటే దేశంలో ఉన్న అన్ని పశువులకూ టీకాలు వేసినట్లే.

## గొర్రెలు, ఉన్ని అభివృద్ధి:-

దేశంలో గోజాతి, గేదెలు తర్వాత గొర్రెలు ముఖ్యమైన పశువులు. ప్రస్తుతం మొత్తం ఉన్ని ఉత్పత్తి ఏడాదికి సుమారు 7 కోట్ల 20 లక్షలు పౌన్లు ఉంది. ఇందులో సగం భాగం తివాచీరకం. ఇది ఎగుమతి చేయబడుతున్నది. ఇది ఇలా ఉండగా దేశం దుస్తుల ఉన్నిని సుమారు 1 కోటి 60 లక్షల పౌన్లను దిగుమతి చేసుకుంటుంది. రెండవ ప్రణాళికలో నాలుగు గొర్రెల పెంపకపు క్షేత్రాలు స్థాపించబడినవి. ఈ క్షేత్రాల్లో విదేశ జాతుల సంపర్కం వలన, దేశీయ జాతుల్లో మేలు రకం వాటిని ఎన్నుకొనటం వలన మేలురకం పొట్టేళ్లు సృష్టి అవుతున్నాయి. స్థానిక జాతుల అభివృద్ధికై గొల్లకాపరులకు మేలురకం పొట్టేళ్లు సరఫరా చేయబడుతున్నాయి. మూడవ ప్రణాళిక ముగింపు నాటికి ఉన్ని ఉత్పత్తి సుమారు 9 కోట్ల పౌన్లకు పెరగవచ్చును.

## కోళ్ల పెంపకం:-

కోళ్ల పెంపకం అవటానికి లఘు పరిశ్రమలే కాని వ్యవసాయదారుడికీ, గ్రామీణ జనాభాలో చాలావర్గాలకూ, ఎంతో లాభదాయకమైన వ్యాపారం. తీరిక

సమయాల్లో పనికల్పిస్తూ యీపరిశ్రమ ఆదాయాన్ని పెంపొందిస్తుంది. రెండవ ప్రణాళికా కాలంలో అయిదు ప్రాంతీయ కోళ్ల క్షేత్రాలు, 269 కోళ్ల విస్తరణ కేంద్రాలు ఏర్పాటు చేయబడ్డాయి. మూడో ప్రణాళికలో 60 రాష్ట్ర కోళ్ల క్షేత్రాలు అభివృద్ధిచేయడం జరుగుతుంది. కొత్తగా మూడు ప్రాంతీయ కోళ్ల క్షేత్రాలు, 50 విస్తరణ - అభివృద్ధి కేంద్రాలు తెరువబడుతాయి.

## పాడి పరిశ్రమ పాల సరఫరా:-

ఈ పథకాలకు మొదటి రెండు ప్రణాళికల్లోనూ రు 25.3 కోట్లు కేటాయించ బడినవి. రెండవ ప్రణాళికా కాలంలో 28 పాల సరఫరా పథకాలు చేపట్టబడి నవి. రెండు పాలపదార్థాల ఫ్యాక్టరీలూ అమృత్‌సర్, రాజకోటల్లో మూడు గ్రామీణ మీగడ యంత్రశాలలూ బారూని, అలీగర్, జునాగఢ్‌ల్లో యీ కాలంలో నెలకొల్ప బడినవి. 1958 - 59 చివరకు దేశంలో 2,257 సహకార పాలసరఫరా సంఘాలు 77 పాల సరఫరా సమాఖ్యలూ ఉన్నట్లు అంచనా వేయబడింది.

మూడవ ప్రణాళికా కాలంలో ఒక లక్షకు మించి జనాభావున్న నగరాల లోనూ కొత్త పారిశ్రామిక బస్తీలలోనూ 55 కొత్త పాలసరఫరా పథకాలు ప్రారం భించాలని ఉద్దేశించబడింది నాలుగు పాల పదార్థాల ఫ్యాక్టరీలూ, ఎనిమిది మీగడ యంత్రశాలలూకూడా నెలకొల్పడానికి ఉద్దేశింపబడింది. మూడవ ప్రణాళికలో పాడిపరిశ్రమకు రు. 36 కోట్లు కేటాయించబడినవి.

## మత్స్య పరిశ్రమ:-

మత్స్య పరిశ్రమాభివృద్ధికి మొదటి రెండు ప్రణాళికల్లోనూ రు 11.8 కోట్లు ఖర్చు చేయబడినవి. ప్రణాళికల్లో అమలు పరిచిన వివిధ చర్యలవల్ల చేపల ఉత్పత్తి 1951 లో ఉన్న ఏడు లక్షల టన్నుల నుండి 1961 కి 14 లక్షల టన్నుల వరకు పెరిగింది.

మూడవ ప్రణాళికా కాలంలో మర పడవల కార్యక్రమం విస్తరించబడు తుంది. మత్స్య పరిశ్రమ రేవుల బెర్తింగ్ వసతుల అభివృద్ధి విషయంలో కృషి జరుగుతుంది. దూరప్రాంతాలకు చేపలను రవాణా చేసేందుకుగాను రెఫ్రిజిరేటర్లు వున్న రైలుపెట్టెలను. ఇన్సులేటెడ్ రోడ్డు ట్రక్కులను ఏర్పాటు చేయటం

జరుగుతుంది. మత్స్య పరిశ్రమాభివృద్ధికి మూడవ ప్రణాళికలో రు. 29 కోట్లు కేటాయించ బడినవి. ఈ కాలంలో ఉత్పత్తి 14 లక్షల టన్నుల నుండి 18 లక్షల టన్నులకు పెరుగుతుందని అంచనా.

## మన రాష్ట్రంలో

ఆంధ్రప్రదేశ్‌లో ఎద్దులు, ఆవులు కలిపి $1\frac{1}{2}$ కోట్లు. గేదెలు, 60 లక్షలు, గొర్రెలు, మేకలు కలిపి 1 కోటి 20 లక్షలు, కోళ్ళు $1\frac{1}{2}$ కోట్లు ఉన్నాయి.

ప్రకృతి సిద్ధమైన అరణ్యాలలో గడ్డిమైదానాలలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం చాలాకాలం నుండి మేలైన పశుజాతులకు ప్రసిద్ధిచెందింది. ఒంగోలు జాతి ఎద్దులకు ప్రపంచ విఖ్యాతి లభించింది. మాల్వి, కృష్ణలోయ జాతికి చెందిన పశువులు తెలంగాణా ప్రాంతంలో సుప్రసిద్ధములు. ఎక్కువగా లంబాడీ ప్రజలు పెంచే హనుమకొండ లేక మర్వాడా జాతి పశువులు పాడికి ప్రసిద్ధిచెందినవి. అందం, పొందిక కావాలంటే అమృతమహల్ జాతి ఎద్దులు చెప్పుకోదగినవి. ఇవి ఎక్కువ బరువు కూడా మోయగలవు. పోతే గేదెలలో ముర్రాజాతి గేదెలు మేలైనవి. ఈ వివిధ జాతుల పశుసంతతి సంరక్షణ, అభివృద్ధి మనకు ప్రధాన కర్తవ్యాలు. మారుమూల గ్రామాలలో కూడా పశువైద్య సౌకర్యాలు కల్పించడం ద్వారా సర్వత్రా పశుజాతి అభివృద్ధిని సాధించడానికై రెండవ ప్రణాళికలో రు. 342.67 లక్షలు ఖర్చుకాగల పథకాలు చేర్చబడినవి. ఈ కాలంలో రాష్ట్రంలో 51 పశువైద్య శాలలను నెలకొల్పడం, 15 సంచార దళాలను స్థాపించడం, 104 ప్రథమ చికిత్సా కేంద్రాలను తెరవటం, 34 కీలక గ్రామ కేంద్రాలు తెరవటం జరిగింది. రాము, మహానంది, చింతల దీవి, పలమనేరులలో ఉన్న ప్రభుత్వ పశుపోషణ క్షేత్రాలు అభివృద్ధి పరచబడినవి.

రాష్ట్రంలోని ఆవులు, గేదెలలో చాలా భాగానికి పుష్టికరమైన గ్రాసం లేనందున వాటివల్ల మనకు కలిగే ప్రయోజనం కూడా పరిమితంగానే ఉంటున్నది. కోడె దూడలను, దున్నలను ఉత్పత్తిచేయటానికే వాటిని పెంచుతున్నారా అనిపిస్తుంది. భారతదేశంలో మేలు జాతి గేదెలు ఆవుల నుండి పాల ఉత్పత్తి సగటున 'యీత' కు 1,500 పౌనులు. మామూలు పశువుల విషయంలో సగటు ఉత్పత్తి ఇందులో సగం ఉంటుందేమో. పశ్చిమ దేశాలలోని పశువుల పాల ఉత్పత్తి

ఖాతను మూడువేల నుండి నాలుగు వేల పౌనుల వరకు ఉంటుంది. దీనిని బట్టి భారతదేశంలో పాడి పరిశ్రమ ఎంతదుస్థితిలో వున్నదో, తగిన శ్రద్ధ లేక ఏ విధంగా నిరాదరణకు పాత్రమవుతున్నదో తెలుస్తుంది. అఖిల భారత వైద్య పరిశోధన సంస్థ నియమించిన బలవర్థకాహార సలహా సంఘం వారు ఆహారంలో 10 ఔన్సుల పాలు ఉండాలని సిఫార్సు చేశారు. కాని మన రాష్ట్రంలో ప్రతి మనిషికి సగటున రోజుకు 5½ ఔన్సుల పాలు మాత్రమే లభిస్తున్నవి. అంటే కావలసిన దానిలో సుమారు సగమన్నమాట.

పాడి పశువులు, పాలసరఫరా అభివృద్ధికిగాను ద్వితీయ ప్రణాళికలో రు. 64.99 లక్షల కేటాయింపబడినవి. విశాఖపట్నం, రాజేంద్రనగర్, కరీంనగరాలలో ఇప్పుడున్న డైరీ ఫారములను అభివృద్ధిచేయడం, హైదరాబాదు, విజయవాడలలో పాలసరఫరా సౌకర్యాలు ఎక్కువచేయడం, పశుగ్రాసక్షేత్రాల నిర్మాణం, పాలబోర్డు నిర్మాణం, పాడి విషయాల సాంకేతిక శాస్త్రంలో అధికారులకు శిక్షణ, పాలసరఫరా సహకార సంఘాలను అభివృద్ధిచేయడం, పట్టణ ప్రాంతాల్లో మరి కొన్ని సహకార సంఘాల ఏర్పాటు మొదలగు వివిధ కార్యక్రమాలు ద్వితీయ ప్రణాళికలో చేర్చబడినవి. ఈ ప్రణాళిక పూర్తి అయ్యేనాటికి సహకార సంఘాల ద్వారా పాలఉత్పత్తి రోజుకు 10 వేల పడులు. అనేక దశాబ్దాలుగా మన దేశంలో పాడి పరిశ్రమయందు సరియైన శ్రద్ధ వహించటం జరగడంలేదు. కాగా దీని సమగ్రాభివృద్ధి ఒకటి రెండు ప్రణాళికల కాలంలో జరిగేపనికాదు. పాల ఉత్పత్తి దార్ల పరిస్థితులను మెరుగుపరిచి పాల ఉత్పత్తిని ఇంకా ఎక్కువచేయడమే మూడవ ప్రణాళిక ప్రధానోద్దేశం. మొదటి రెండు ప్రణాళికల కాలంలో జరిగిన కృషి ఇతోధికంగా కొనసాగించబడుతుంది. పాల ఉత్పత్తిదారులకూ, వినియోగించే ప్రజలకూ అనుకూలమైన ధరలకు కల్తీలేని ఆరోగ్యకరమైన పాలను సరఫరా చేయడము, ఇంకా మరికొన్ని ప్రదేశాలకు కూడా పాలసరఫరా పథకాలను విస్తరింపచేయడమూ మూడవ ప్రణాళిక లక్ష్యం.

గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో పశువుల తర్వాత పేర్కొనదగినవి గొర్రెలు, భారతదేశ మంతటిలోకీ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోనే గొర్రెలు ఎక్కువగా ఉన్నాయి. చదరపు మైలుకు సాంద్రతనుబట్టి లెక్కించినా మన రాష్ట్రమే అగ్ర స్థానంలో ఉంటుంది. మనరాష్ట్రంలోని గొర్రెలమొత్తం విలువ రు. 17 కోట్ల

వరకు ఉంటుందనీ, ఏటేటా వీటినుండి ఉన్ని, తోళ్లు, మాంసం ఎరువులు మొదలగునవి సుమారు రు. 10 కోట్ల విలువ వరకు లభిస్తున్నాయనీ అంచనా. గొర్రెల ఉన్ని పరిశ్రమమీద వేలాది వ్యాపారస్థులే కాక వెనుకబడిన జాతులకు చెందిన లక్షలాది వ్యవసాయదార్లు చేతి వృత్తుల పనివారు జీవిస్తున్నారు. ఉన్నిపరిశ్రమను అభివృద్ధి చేయటానికి మన రాష్ట్రంలో చాలా అవకాశాలు ఉన్నాయి. పశుపోషణశాఖవారు అనేక పథకాలను అమలుపరిచి వ్యవసాయదారులకు అధికాదాయం లభించే మార్గాల కొరకు ప్రయత్నాలు చేస్తున్నారు.



రాజస్థాన్‌కు చెందిన బికనేరి పొట్టేళ్లను తెచ్చుకొని పెంచడం ద్వారా మన రాష్ట్రంలోని గొర్రెలనుండి ఉన్ని నాణ్యతను పెంచవచ్చునని పరిశోధనలవల్ల స్పష్టంగా ఋజువయింది. రాజేంద్రనగర్, పెనుగొండ క్షేత్రాలలో బికనేరి గొర్రెల పెంపకం కార్యక్రమాన్ని ప్రభుత్వ పశుపోషణ శాఖవారు ప్రారంభించారు. అంతే కాక రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలలో 22 గొర్రెలు, ఉన్నిఉత్పత్తి కేంద్రాల స్థాపనకుకూడా చర్యలు తీసుకుంటున్నారు.



మేలు జాతి గొర్రెల ఎన్నిక, పనికిరాని వాటి ఏరివేత చాలా జాగ్రత్తగా శాస్త్రీయపద్ధతిలో జరుగవలసి ఉంటుంది. గొర్రెల పెంపకంలోనూ. నిర్వహణలోనూ అభివృద్ధికరమైన నూతన విధానాలను ప్రచారం చేయడానికి, ఉన్ని తీయడంలో కొత్త పద్ధతులను ప్రదర్శించడానికి గొర్రెల తూకం పెంచి వాటి ఉత్పత్తిశక్తిని అధికం చేయటానికి ఆంధ్రప్రాంతంలో 7 గొర్రెల ఉన్ని ఉత్పత్తి ప్రదర్శన క్షేత్రాలు నెలకొల్పబడినవి. ఇటువంటి 5 కేంద్రాలు తెలంగాణాలోకూడా రెండవ ప్రణాళికాకాలంలో ఏర్పాటు చేయడానికి చర్యలు తీసుకోబడ్డవి. రెండవ ప్రణాళికా కాలంలో పరిశోధనకూ పరిశ్రమ అభివృద్ధికీ అవసరమైన ప్రాథమిక సౌకర్యాలు కల్పించబడ్డాయి. వీటి ఆధారంతో మూడవ ప్రణాళికా కాలంలో గొర్రెలు ఉన్ని అభివృద్ధి కార్యక్రమం ఇతోధికంగా నిర్వహించబడుతుంది.

ఆంధ్ర ప్రదేశ్ సముద్రతీరప్రాంతాల్లో, ఇతరనదులు, సరస్సులు మొదలైన వాటిలో చేపలు పుష్కలంగా లభిస్తాయి. చేపల పరిశ్రమ అభివృద్ధికై రెండవ ప్రణాళికలో రు 70.28 లక్షలు కేటాయించారు. రెండవ ప్రణాళిక మొదటి నాలుగు సంవత్సరాలలో 70 యాంత్రిక నావలను కొనడం, తగ్గింపు ధరలకు 30,024 పౌండ్ల వలలను జాలర్లకు లభింపచేయడం. 80 మంది జాలర్లకు నవీనపద్ధతులలో

శిక్షణ ఇవ్వడం, చేపలను నిల్వచేయటానికై హైదరాబాదు నిజాంసాగర్‌లలో శీతల గిడ్డంగులను నిర్మించటం, ఉత్పత్తి కేంద్రాలనుండి వినియోగ కేంద్రాలకు చేపల రవాణాకై 7 వ్యానులు కొనడం జరిగింది.

మూడవ ప్రణాళికలో పశుపోషణ పథకాలకు రు 385 లక్షలు కేటాయించబడినవి. దీనిలో యీ సంవత్సరం రు 54.07 లక్షలు ఖర్చవుతవి; పాడిపరిశ్రమ, పాలసరఫరాకు రు 296 లక్షలు కేటాయించారు; ఇందులో 1961-62 లో ఖర్చుచేసేది రు 49.50 లక్షలు. మత్స్యపరిశ్రమకు మొత్తం కేటాయింపు రు 115 లక్షలు. ఇందులో యీ యేడు ఖర్చయ్యేది రు 19.13 లక్షలు.

